# ఆంధ్ర గ్రంథములు.



| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| ఆంధ్రనాయకశతకము | 0 | 4 |
| ఉద్దండరాయశతకము | 0 | 2 |
| ఒంటిమెట్టరఘువీరశతకము | 0 | 2 |
| కాళహస్తిశతకము | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవి | 0 | 2 |
| ,, నాగపూడికుప్పుస్వామయ్యది | 0 | 4 |
| కాంతాలరామశతకము | 0 | 4 |
| కామేశ్వరీశతకము | 0 | 2 |
| కీరవాణిశతకము | 0 | 4 |
| కుమారీశతకము, సటీక | 0 | 3 |
| కుక్కుటేశ్వరశతకము | 0 | 3 |
| కృష్ణశతకము, నృసింహకవి | 0 | 2 |
| గోట్టుముక్కలరాజగోపాల శతకము | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | 0 | 2 |
| చిత్తబోధశతకము, సటీక | 0 | 3 |
| చెన్నమల్లుసీసములు | 0 | 2 |
| జగన్నాయకశతకము | 0 | 2 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0 | 2 |
| దాశరథీశతకము, సటీక | 0 | 4 |
| దేవకీనందనశతకము | 0 | 2 |
| నారాయణశతకము, | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నారాయణశతకము, పోతనది | 0 | 4 |
| నృకేసరిశతకము, శేషాచలదాసు | 0 | 2 |
| నృసింహశతకము, శేషప్పకవి | 0 | 3 |
| పార్థసారథిశతకము | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | 0 | 3 |
| భక్తచింతామణిశతకము | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము | 0 | 2 |
| డిటో (వేదాంతము), పరశు రామ నరసింహదాసు | 0 | 4 |
| భద్రాద్రిశతకము, భల్లాపేరయ | 0 | 3 |
| భాస్కరశతకము, సటీక | 0 | 4 |
| మహిజామనోహరశతకము | 0 | 2 |
| మహిషాసురమర్దనిశతకము | 0 | 2 |
| మాతృశతకము, అప్పావుమొదలి | 0 | 1 |
| మాధవశతకము | 0 | 2 |
| మానసబోధశతకము, సటీక | 0 | 3 |
| మారుతిశతకం, కోదండరామకవి | 0 | 2 |
| ముకుందశతకము | 0 | 2 |
| ముకుందరాఘవశతకము | 0 | 4 |
| యాదగిరీంద్రశతకము | 0 | 2 |
| ఒంటిమెట్టరఘువీరశతకము | 0 | 2 |
| రఘుతిలకశతకము | 0 | 2 |
| రంగశాయిశతకము | 0 | 2 |

శ్రీరస్తు.

శ్రీమదాంధ్రభాగవతమందలి

# కుచేలోపాఖ్యానము.

టీకాతాత్పర్యసహితము.





చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1928.

# పీ ఠి క.

భగవంతుఁ డగువిష్ణునియుత్కర్షముం దెలుపు పురాణము గావున దీనికి భాగవత మనుపేరు గలిగినది. పురాణములలో విష్ణూత్కర్షమును దెలియఁజేయువానిలో భాగవత మగ్రగణ్యము. భాగవతములోని యంతర్భాగములకు స్కంధములు (బోదె) అనిపేరు. ఇట్లనుటచేత భాగవతము కల్పవృక్ష మని ధ్వని.

ఈభాగవతమును ఆంధ్రముగా రచించిన బమ్మెరపోతరాజు కడపమండలములోని 'ఏకశిలానగర' మనఁబడిన యొంటిమిట్టగ్రామవాసియగు నియోగిబ్రాహ్మణుండు. కేతన్నలక్కమ్మల పుత్త్రుఁడు. ఈయనపుత్త్రుఁడు మల్లన. వీరిది కౌండిన్యగోత్రము. క్రీ. శ. 1373 లో జన్మించి క్రీ. శ. 1436 సంవత్సరమువఱకు జీవించెను.

కాశీఖండము, శృంగారనైషధము, హరవిలాసము మొదలగు గ్రంథములను రచించిన శ్రీనాథుండును, భోజరాజీయము, రసాభరణము, అనంతునిఛందస్సులను విరచించిన యనంతుండును, విక్రమార్కచరిత్రమును వ్రాసినజక్కనయు,జైమినిభారతంబును విరచించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుండు నీతని సమకాలికులు.

పోతన నరస్తుతి కిష్టపడఁడు. ఈతఁడు వ్రాసినకావ్యములు:—ఆంధ్రభాగవతము, వీరభద్రవిజయము, భోగినీదండకము (అని వాడుక).

ఈయాంధ్రభాగవతము వేదవ్యాసుఁడు వ్రాసినసంస్కృత భాగవతమునకుఁ జాలవఱకు సరియైన తెలుఁగు. సంస్కృతము నుండి తెలుఁగునకు భారతరామాయణములు భాషాంతరీకరణముచేసిన నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగ్గడ, భాస్కరుఁడు మున్నగువారివలెఁగాక, ఈతఁడు మూలగ్రంథములోనికథ నేమాత్రమేని వదలికాని, మార్చికాని, క్లిష్టముచేసికాని యున్నవాఁడు కాఁడు. మాతృకలోనున్నదాని నున్నటులె తెనిఁగించెను. భగవద్విషయము వచ్చినపుడు సంస్కృతమున నున్నదానినే తెనిఁగించుటతోఁ దృప్తిఁబొందక ఇంకను తనభక్తికొలఁది విశేషముగాఁ గొన్నివర్ణనలు చేసియున్నాఁడు. మఱియు సంస్కృతమునలేని నరకాసురునితోడి సత్యభామయుద్ధము మున్నగునవి విష్ణుపురాణము మొదలయిన యితరగ్రంథములనుండి కొని తనగ్రంథమును బెంచెను. చదువువారికిని, వినువారికిని, నుద్రేకము హెచ్చుటకయి కరుణ, వీర, రౌద్రాదిరసములు వచ్చునప్పుడు సందర్భానుసారముగా నంశమును, మిగుల విరళపఱచియున్నాఁడు. కావుననే సంస్కృతమున 18000 ల శ్లోకములలో నిమిడిన భాగవతము తెలుఁగున 30000 ల పద్యములకువచ్చినది.

ఈభాగవతము నీతఁడు తెనిఁగించినట్లు తెలిసి నెల్లూరుజిల్లా యందలి వేంకటగిరిసంస్థానాధిపతి యగుసర్వజ్ఞసింగమనాయుఁడు దానినిఁ దన కంకితముసేయఁగోరఁగా నితఁడు సమ్మతింపఁడయ్యెనఁట. అందులకుం గినిసి యారాజు దానిని బలాత్కారముగాఁ దీసికొని పాఁతిపెట్టించెనఁట. పిదప శ్రీరామమూర్తి యా

రాజేంద్రునిభార్యకు స్వప్నమునఁ గాన్పించి "నీవు మగనికి హితవు చెప్పి పోతనయాంధ్రభాగవతమును మరల నుద్ధరించునట్లు చేయవేని మీవంశమంతయు నిర్మూలముచేయుదు" ననియెనఁట. ఆమె తన స్వప్నముఁ దెలుపఁగా మగఁడు విని వెఱచి యాగ్రంథమును మరలఁ బెల్లగింపించి పోతనామాత్యు నింటికిఁ బంపెనఁట. అప్పటి కాయన మరణమునొందియుండుటం జేసి గంగనాదికవు లాగ్రంథమును బరీక్షించి భూమిలోఁ బాఁతిపెట్టిన కాలమున మన్నుదినియుఁ జెదలుపట్టియుం బాడైనభాగములను వారు పూరించిరని కొందఱు చెప్పుచున్నారు. పోతనమరణకాలము వఱకును దా రచించినభాగవతము నెవ్వరికిం జూపక ప్రాణపదముగఁ దన దేవతార్చనామందిరమునఁ బదిలముగ దాఁచి యవసానకాలమునఁ దనపుత్త్రుఁ డగుమల్లనకుఁ జెప్పెననియు, ఆమల్లన పిదపఁ జూచుతఱి నందలి తాటియాకులకు నడుమ నడుమ బాణమును పురుగు తినియుండెననియు, అంతట నాతఁడీ గంగయాదులను వేఁడుకొని దానిని మరలఁ బూర్తిచేయించెననియు మఱికొందఱూహించుచున్నారు. భాగవతభాగములు ఏకారణముచేతనైన నేమి శిథిలము కాఁగా నితరులు పూరించిరనుట స్పష్టము.

(1) ద్వితీయస్కంధములో బ్రహ్మ నారదునకు తత్త్వోపదేశము సేయుఘట్టము "పశుయజ్ఞ" అనుపద్యమునుండి — వెలిగందల నారయ.

(2) తృతీయ, చతుర్థస్కంధము, ప్రథమ, ద్వితీయస్కంధములో పై వివరించినమట్టుకు సప్తమ, అష్టమ, నవమ, దశమము (పూర్వ భాగము) లు — పోతన.

(3) దశమము (ఉత్తరభాగము) — వెలిగందల నారయ.

(4) ఏకాదశ, ద్వాదశములు — నారాయణాఖ్యుఁడు.

N. B. ఈ కుచేలోపాఖ్యానము దశమస్కంధము ఉత్తర భాగమున గలదు. అది వెలిగందల నారయ రచియించెను.

శైలి.—ద్రాక్షాపాకము. కోమలము లగుపదములచేఁ గూర్పఁబడి కైశికీవృత్తి, ప్రధానముగాఁ గలిగియున్నది. రసము చక్కఁగాఁ బోషింపఁబడినది. భక్తిరసము వీలగుచోట్ల నెల్ల గుప్పించుటయే యీగ్రంథమునకు మెఱుఁగు. ఇందు అంత్యనియమాది చిత్రకవితాశబ్దాలంకారములు విజృంభించి వ్రాయఁబడినవి. శ్లేషానుప్రాణితము లగునర్థాలంకారముల నుపయోగించుటలోఁ బోతన కాదంబరీగ్రంథకర్త యగుబట్టబాణుని ననుకరించియున్నాఁడు. తెలుఁగు సంస్కృతములు సమముగా ననుసంధింపఁబడినవి. పోతన యిట్లు ప్రతిజ్ఞచేసి భాగవతమును వ్రాసి యున్నాఁడు.

క. కొందఱకుఁ దెనుఁగు గుణ మగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణ మగు రెండుం
గొందఱకు గుణము లగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

వావిళ్ల. వేంకటేశ్వరులు.

శ్రీ ర స్తు.

శ్రీమదాంధ్రభాగవతమందలి

# కుచేలోపాఖ్యానము.



క. హలధరుఁ డమర్త్యచరితుం
డలఘుభుజాబలుఁ డొనర్చునద్భుతకర్మం
బులు పెక్కు నాల్గుమొగములు
గలమేటియు లెక్కపెట్టఁగలఁడె నరేంద్రా. 1

టీక. హలధరుఁడు = బలరాముఁడు, అమర్త్యచరితుఁడు=అమానుష ప్రజ్ఞగలవాఁడు, అలఘుభుజాబలుఁడు = విస్తారమైన చేతిలావుగలవాఁడు, కర్మంబులు = చేఁతలు, నాల్గుమొగములుగలమేటి=బ్రహ్మ, కలఁడే = లేఁడు.

తాత్పర్యము. అమానుషప్రజ్ఞయు, మిక్కిలి బలమును గల యాబలరాముని ఆశ్చర్యజనకములగు కార్యంబులఁ జేర్కొనుటకు బ్రహ్మకును దరము గాదు.

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లను బద్మపత్త్రలో
చనునియనంతవీర్యగుణసంపద వేమఱు విన్ననైనను
దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనుల
న్వినిన మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరామ మొందఁడే.

టీ. మునీంద్రున్=శుకమహర్షిని, ధరాధిపుఁడు=పరీక్షిత్తుఁడు, పద్మపత్త్రలోచనుని = తమ్మిరేకులవంటి కన్నులుగలకృష్ణుని, అనంతవీర్యగుణ

సంఖద=నాశములేని పరాక్రమముయొక్క గుణములభాగ్యమును, తనియదు= తృప్తిజెందనేరదు. చిత్తము=మనసు, అచ్యుతకథావిభవంబు = నాశములేని శ్రీకృష్ణుని చరిత్రముయొక్క వైభవము, వీనులక్ = చెవులగుండ, మనోజ పుష్పశరవిద్ధుఁడు=మన్మథబాణములచేఁ గొట్టఁబడినవాఁడు, (మన్మథవికారమును జెందినవాఁడుకూడ) విరామము=స్తిమితము.

తా. శ్రీకృష్ణుని బలపరాక్రమసంపదలం గూర్చి యెన్నిపర్యాయములు విన్నను తనివిదీఱకయున్నది, శ్రీకృష్ణునికథాశ్రవణంబుచేత కాముకుఁడుగూడ విరాగుఁడగును.

వ. అదియునుం గాక. 3

చ. హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁ గోరి
మ్రొక్కుతత్, చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరినచిత్తము
చిత్త మిందిరావరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించిన
వాణి వాణి య, చ్ఛురకథ లానుకర్ణములు కర్ణములై విల
సిల్లుఁ బో భువిన్. 4

టీ. హరి=విష్ణువును, భజియించు = కరతాళములచేఁబొగడు, అచ్యుతుక్=నాశములేని విష్ణువును, కోరి=ఆసక్తిగొని, మ్రొక్కు=నమస్కారములొనర్చునట్టి, చక్రధరుఁజేరిన = విష్ణువున కధీనమైన, ఇందిరావరుక్=లక్ష్మీదేవికి మగఁడైన విష్ణువును, దృష్టి=చూపు, మురవైరి=మురాసురునకు శత్రువైన విష్ణువును, నుతించిన=పొగడునట్టి (స్తోత్రముచేయునట్టి), ఆను=రుచిచూచునట్టి, విలసిల్లుక్=వెలయును, పో=నిశ్చయము.

తా. మానవశరీరమందలి యేయంగమైనను విష్ణుసేవాతత్పరతఁ జెందనినాఁడు ప్రకాశింపనేరదు. భగవంతుని నామసంకీర్తనమం దాసక్తిఁ జెందిన యంగములే యీలోకమునందు ప్రాధాన్యమును గాంచుననుట యెంతయు నిశ్చయము. లాటానుప్రాసము. శబ్దాలంకారము.

క. హరిపాదతీర్థసేవా
పరుఁడై విలసిల్లునట్టిభాగవతుని వి
స్ఫురితాంగము లంగము లా
పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా. 5

టీ. హరిపాదతీర్థ సేవాపరుఁడు=విష్ణువుయొక్క పాదములయందలి తీర్థమును సేవించుటయం దాసక్తిగలవాఁడు, ఐ విలసిల్లు=అయి ప్రకాశించునట్టి, భాగవతుని=భగవద్భక్తునియొక్క, విస్ఫురిత=ప్రకాశించుచున్న, అంగము=అవయవములు, ఎఱుఁగన్=తెలియునట్లు, పలుకుము=చెప్పుము.

తా. విష్ణువును సేవించునట్టి భగవద్భక్తునియొక్క అవయవములే అవయవములు గాని తక్కినవానివి కావు. కావున నాపరమేశ్వరుని మహిమలు నాకుఁ దెలియఁ జెప్పుము. లాటానుప్రాసము. శబ్దాలంకారము.

సీ. అనుఁడు వేదవ్యాసతనయుఁ డాయభిమన్యు
తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర గోవిందసఖుఁడు కుచేలుండు
నా నొప్పువిప్రుండు మానధనుఁడు
విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు
బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి
తే. నడుగఁ బోవక తనకుఁ దా నబ్బినట్టి
కాసు పదివేలనిష్కము ల్గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్త్రదారాభిరక్ష
యొకవిధంబున నడుపుచు నుండు నంత. 6

టీ. అనుడున్=అని పరీక్షితుఁ డడుగఁగా, వేదవ్యాసతనయుండు=శుకమహర్షి, ఆయభిమన్యుతనయునిన్=పరీక్షితుని, ప్రీతిన్=ఆదరముతో,

జనవర=రాజా! గోవిందసఖుఁడు = కృష్ణునిచెలికాఁడు - కుచేలుఁడు, మానధనుఁడు=గౌరవమే ధనముగాఁ గలవాఁడు, విజ్ఞాన = తెలియుట, రాగ = కోరిక, ఆది = మొదలుగాఁ గలవానిచే విడువఁబడిన మనస్సుగలవాఁడు, శాంతుఁడు = ఓర్పుగలవాఁడు, ధర్మవత్సలుఁడు = ధర్మమునందుఁ బ్రేమ గలవాఁడు, ఘనుఁడు = గొప్పవాఁడు, విజిత=జయింపఁబడిన, ఇంద్రియుఁడు =ఇంద్రియములు గలవాఁడు, బ్రహ్మవేత్త=బ్రహ్మనెఱింగినవాఁడు, కార్పణ్యవృత్తిన్ = లుబ్ధత్వముచేత, అబ్బినట్టికాసు = చిక్కినట్టికాసును, నిష్కముల్ = బంగారు నాణెములుగా, ఆత్మ=మనస్సునందు, మోదించి=సంతోషించి, పుత్త్ర = కొడుకులయొక్కయు, దార = భార్యయొక్కయు, అభిరక్షన్ = కాపాడుటను.

తా. కృష్ణునిచెలికాఁడగునిరుపేదయైనకుచేలుండు తాను పరమదరిద్రుండయ్యు దారపుత్త్రాదుల భరింప నొకరినడుగఁ గడులజ్జితుఁడై తనకుండు కొంచెమునే గొప్పగా నెంచియుండఁగా.

సీ. లలితపతివ్రతాతిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడు నొచ్చి పెదవులు దడుపుచు
శిశువు లాఁకటిచిచ్చుచేఁ గృశించి
మలమల మాఁడుచు మానసం బెరియంగఁ
బట్టెఁ డోరెము మాకుఁ బెట్టుమనుచుఁ
బత్త్రభాజనయుతపాణులై తనుఁ జేరి
వేఁడ వీనులు చుఱుఁ జూఁడినట్టు
తే. లైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నోజీవితేశ
తట్టుముట్టాడు నిట్టిపేదఱిక మిట్లు
నొంప దీని కుపాయ మూహింపవైతి.

టీ. లలిత=ఒప్పుచున్న, పతివ్రతాతిలకంబు = పతివ్రతలలో నుత్తమురాలు, వంశాభిజాత్య = మంచికులమునందుఁబుట్టినది, తద్భార్య = ఆకుచేలుని పెండ్లము, దుస్సహ=ఓర్వరాని, దరిద్రపీడచేన్ = పేదఱికమువలని బాధచేత, కడునొచ్చి = మిక్కిలి బాధపడి, శిశువులు = బిడ్డలు, ఆఁకటిచిచ్చుచేన్ = ఆఁకలిమంటచేత, కృశించి=చిక్కి, మానసంబు=మనస్సు, ఎరియంగన్=మండఁగా, పట్టెఁడు=పిడికెఁడు, ఓరెము = అన్నము, మాకున్=బిడ్డలకనుట, పత్త్రభాజనయుతపాణులై = విస్తరాకులతోఁ గూడిన చేతులు గలవారలై, తనున్ = తల్లిని, చేరి=పొంది, వేడన్ = ప్రార్థింపఁగా, వీనులు = చెవులు, చుఱన్=చుఱచుఱయని, చూఁడినట్లు = కాల్చినట్లు, వగచి = దుఃఖించి, నిజఅధినాథున్ = తనమగని-కుచేలుని, చేరి = పొంది, ఓజీవితఈశ= ఓప్రియుఁడా! తట్టుముట్టాడు ఇట్టిపేదఱికము=మిక్కిలి చుట్టుకొన్నయిట్టి బీదతనము, నొంపన్=బాధింపఁగా, ఊహింపవైతివి=ఆలోచింపవైతివి.

తా. మిక్కిలి పతివ్రత యైన ఆకుచేలునిభార్య బీదఱికముచేత బాధింపఁబడి, బిడ్డలు ఆఁకలిచే మలమల మాఁడుచుఁ బట్టెఁడన్నముఁ బెట్టుమని విస్తళ్లు చేతఁ బట్టి వేఁడఁగా నామె మిక్కిలి దుఃఖించి తనమగనిఁ జూచి ప్రాణనాథా ఇట్టిపేదఱికమును బోఁగొట్టుటకు నుపాయము నాలోచింపక పోతివి.

వ. అని మఱియు నిట్లనియె. 8

తే. బాల్యసఖుఁ డైనయప్పద్మపత్త్రనేత్రుఁ
గాన నేఁగి దారిద్ర్యాంధకారమగ్ను
లై నమము నుద్ధరింపుము హరికృపాక
టాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు. 9

టీ. మహాత్ ఆత్మ=గొప్పప్రభావము గలవాఁడా! కుచేలునిసంబోధనము. నీవు, బాల్యసఖుఁడు = చిన్ననాఁటిస్నేహితుఁడు, ఐనఅప్పద్మపత్త్రనేత్రున్ = అయినట్టియాతామర రేకులవంటి కన్నులు గలవానిని, కృష్ణుని,

కాంచన్ = చూచుటకు, ఏఁగి=పోయి, దారిద్ర్యఅంధకారమగ్నులు=పేదఱికమను చీఁకటియందు మునిఁగినవారు, అయినమమున్ = అయినట్టిమమ్ము, (భార్యను బిడ్డలననుట.) హరికృపాకటాక్షరవిదీప్తిన్ =కృష్ణుని దయతోడి చూపనెడు సూర్యునికాంతిని, వడసి=పొంది, ఉద్ధరింపుము = లేవనెత్తుము.

తా. నీవు కృష్ణునిదగ్గఱకుఁ బోయి ఆయన యనుగ్రహము నొంది పేదఱికము చేఁ బీడింపఁబడిన మమ్ముఁ గాపాడుము.

వ. మఱియును. 10

చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁగుశస్థలీ
పురమున యాదవప్రకరము ల్భజియింపఁగ నున్నవాఁడుమీ
రరిగిన మిమ్ముఁ జూచి విభుఁ డప్పుడయిచ్చుననూనసంపదల్.

టీ. వరదుఁడు=వరముల నిచ్చువాఁడు, సాధుభక్తజన వత్సలుఁడు = సత్పురుషులయందును భక్తిగల జనులయందును దయగలవాఁడు, ఆర్తశరణ్యుఁడు = దుఃఖము గలవారికి దిక్కైనవాఁడు, ఇందిరావరుఁడు = లచ్చిమగఁడు, దయాపయోధి=దయకు సముద్రుఁడు, యాదవప్రకరముల్ = యాదవులయొక్క సమూహములు, భజియింపఁగన్ = కొలువఁగా, మీరు, (కుచేలుఁడనుట.) విభుఁడు = ప్రభువైనకృష్ణుఁడు, అనూన = తక్కువకాని, ఎక్కువసంపదను, వచ్చున్.

తా. వరముల నిచ్చువాఁడును, సత్పురుషులయందును భక్తులయందును దయగలవాఁడును, దుఃఖముగలవారిని రక్షించువాఁడును, మిక్కిలిదయగల వాఁడును ఆయిన కృష్ణుఁడు యాదవులతోఁ గుశస్థలియను పట్టణమున నున్న వాఁడు, అచ్చటికి నీవు పోయినయెడల నెక్కుడుసంపదలనిచ్చును.

మ. కలలోనం దను మున్నెఱుంగనిమహాకష్టాత్ముఁ డైనట్టిదు
ర్బలుఁ డాపత్సమయంబున న్నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ

దలఁపం దా మదిమెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్సుని
శ్చలభక్తి న్భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్.

టీ. కలలోనన్ = స్వప్నమందైనను, తనున్ = తన్ను (కృష్ణుని), మున్ను = పూర్వము, ఎఱుంగనిమహాత్ కష్టఆత్ముఁడు = తెలియని మిక్కిలి కఠినమైన మనస్సుకలవాఁడు, ఐనట్టి, దుర్బలుఁడు = బలములేనివాఁడు, ఆపత్ సమయంబునన్ = ఆపత్కాలమునందు, నిజ=తనదైన, పదాబ్జాతంబులు = కమలములవంటి పాదములను, ఉల్లంబులోన్=మనస్సునందు, తలంపన్=ధ్యానముచేయఁగా, తాన్, మదిన్ = మనస్సునందు, మెచ్చి, ఆర్తిహరుఁడై=దుఃఖమును బోఁగొట్టువాఁడై, తన్నున్, ఐనన్, ఇచ్చున్, సునిశ్చలభక్తిన్=మిక్కిలి చలింపనిభక్తిచేత, భజియించువారికిన్=సేవించువారికి, సంపత్ విశేష ఉన్నతుల్ = సంపదలయొక్క అతిశయముచే నైన గొప్పతనములను, ఇడఁడు ఏ=ఇయ్యఁడా:—ఇచ్చునని భావము.

తా. ఆకృష్ణుఁడు ఎన్నఁడును తన్నుధ్యానముచేయనివాఁడుగూడ ఆపత్కాలమునందు ఒకపర్యాయము మనస్సులో ధ్యానముచేసినంతనే యేమి యడిగినను ఇచ్చును. భక్తితోఁ గొల్చువారికి నిచ్చునని చెప్పవలయునా? కావ్యార్థాపత్తి అలంకారము.

క. అని పలికిన నమ్మానిని
సునయోక్తుల కలరి భూమిసురుఁ డాకృష్ణున్
గన నేఁగుట యిహపరసా
ధన మగు నని మదిఁ దలంచి తనసతితోడన్. 13

టీ. అమ్మానిని=ఆస్త్రీయొక్క, సునయఉక్తులకున్ = మిక్కిలి నీతితోడిమాటలకు, అలరి = సంతోషించి, కనన్ = చూచుటకు, ఏఁగుట = పోవుట, ఇహాపరసాధనము = ఈలోకమును నాలోకమును సాధించునది.

తా. అట్లు చెప్పినభార్యమాటలకు సంతోషించి ఆకుచేలుఁడు కృష్ణుని జూచుటచే నీలోకమునందును బరలోకమునందును సౌఖ్యము గలుగు నని తలంచి తనభార్యతో.

తే. నీవు సెప్పినయట్ల రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన మాచక్రపాణి కిపుడు
గాను కేమైనఁ గొంపోవఁగలదె మనకు. 14

టీ. రాజీవనేత్రు పాదపద్మంబులు=కృష్ణునితామరలవంటియడుగులను, ఆశ్రయింపంగన్ = కొలుచుటకు, చనుట = పోవుట, పరమశోభనము = మిక్కిలి మేలు, ఆచక్రపాణికిన్ = ప్రసిద్ధమైన చక్రమును చేతఁ గలవానికి, కృష్ణునకు, కానుక = నజరు, కొనిపోవన్ = తీసుకొనిపోవుటకు, కలదె=ఉన్నదా?

తా. నీవు చెప్పినట్లు కృష్ణుని సేవించుటకుఁబోయెదను. కృష్ణునకు కానుకగా తీసికొనిపోవుట కేమైననున్నదా?

తే. అనిన నయ్యింతి యౌఁ గాక యనుచు విభుని
శిథిలవస్త్రంబుకొంగునఁ బృథుకతండు
లమ్ము లొకకొన్ని ముడిచి నెయ్యమున ననుప
జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు. 15

టీ. అయ్యింతి =ఆస్త్రీ; (కుచేలునిభార్య.) ఔఁగాక=అట్లేకానిమ్ము, విభుని=మగనియొక్క, శిథిల=చినిఁగిన, కొంగునన్=చెఱఁగునందు, పృథుకతండులములన్ = అడుకులగింజలను, ఒకకొన్ని = కొంచెము, ముడిచి = మూఁటగట్టి, నెయ్యమునన్=ప్రీతితో, అనుపన్ = పంపఁగా, గోవిందదర్శన ఉత్సాహి = కృష్ణునియొక్క చూచుటయందు సంతోషముకలవాఁడు, చనియెన్ = పోయెను.

తా. అని కుచేలుఁ డడుగఁగా నతనిభార్య యట్లై కానిమ్మని మగని వస్త్రమున నడుకులు కొన్ని మూఁటగట్టి పంపఁగాఁ గుచేలుఁడు కృష్ణునిఁ జూచుటకు సంతోషముతోఁ బోయెను.

వ. అట్లు చనుచుం దనమనంబున. 16

సీ. ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును
భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగి
దర్శింపఁ గలనొ తద్ద్వారపాలు
రెక్కడివిప్రుఁడ విం దేల వచ్చెద
వని యడ్డ పెట్టిరే నపుడు వారి
కేమైనఁ బరిదాన మిచ్చి చొచ్చెద నన్న
నూహింప నర్థశూన్యుండ నేను
తే. ఐన నాభాగ్య మతనిదయార్ద్రదృష్టి
గాక తలపోయఁగా నొండు గలదె యాతఁ
డేల నన్ను నుపేక్షించు నేటిమాట
లనుచు నాద్వారకాపుర మతఁడు సొచ్చి. 17

టీ. చొత్తును = ప్రవేశింతును, భాసుర అంతఃపురవాసి = ప్రకాశించుచున్న యంతఃపురమునం దున్నవాఁడు, అప్పుండరీకాక్షున్ = ఆతెల్లదామరలవంటి కన్నులు గలవానిని, అఖిలఈశున్ = ఎల్లవారికిఁ బ్రభువైనకృష్ణుని, ఎబ్భంగిన్ = ఏవిధమున, దర్శింపన్ గలనో = చూడఁగలనో, తత్ద్వారపాలురు = ఆతనివాఁకిలి కావలివారు, అడ్డపెట్టిరిఏన్ = అడ్డగించిన పక్షమున, వారికిన్ = ఆద్వారపాలకులకు, పరిదానము = ఈనాము, ఊహింపన్ = ఆలోచింపఁగా, అర్థశూన్యుండన్ = ధనములేనివాఁడను, నాభాగ్యము = నాయదృష్టము, అతనిదయార్ద్రదృష్టి = అతనిదయచేఁ దడిసినచూపు, తలపోయఁగాన్ = ఆలోచింపఁగా, ఒండు = వేఱు, కలదే = కలదా? లేదనిభావము. అతఁడు = ఆకృష్ణుఁడు, నన్నున్ = కుచేలుని, ఉపేక్షించున్ = ఒప్పరికించును, ఏటిమాటలు = ఎక్కడిపలుకులు?

తా. నేను ద్వారకకుఁబోయి అంతఃపురములో నున్న కృష్ణుని ఎట్లు చూడఁగలను ? అచ్చటఁ గావలివారలు నీవెక్కడివాఁడ వని యడ్డగించిన

పక్షమున వారి కేమైన నిచ్చి పోవుటకు నేను పేదవాఁడను, అయినప్పటికిని ఆయనదయయె నాభాగ్యము గనుక నన్నతఁడు ఆదరింపకపోఁడని తలంచుచు, ద్వారకాపట్టణమునకుఁబోయి.

వ. ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జని చని కక్ష్యాంతరం
బులు గడచి చని ముందట. 18

టీ. ప్రవేశించి = చొచ్చి, కక్ష్యాంతరంబులు = తొట్టికట్టను, కడచి = దాఁటి, చని = పోయి, ముందటన్ = ఎదుట.

సీ. విశదమై యొప్పుషోడశసహస్రాంగనా
కలితవిశాలసంగతిఁ దనర్చి
మహనీయతపనీయమణిమయగోపుర
ప్రాసాదసౌధహర్మ్యములు సూచి
మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి
సంతోషబాష్పము ల్జడిగొనంగఁ
బ్రకటమై విలసిల్లు నొకవధూమణిమంది
రమున నింతులు చామరములు వీవఁ
తే. దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి
మహితలావణ్యమన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 19

టీ. విశదము = స్వచ్ఛము, ఐఒప్పు = అయి ప్రకాశించునట్టి, షోడశసహస్ర = పదునాఱువేల, అంగనా = స్త్రీలచేత, కలిత = పొందఁబడిన, విశాల = అధికమైన, సంగతిన్ = సంబంధముచేత, తనర్చి = ఒప్పి, మహనీయ = పూజింపఁదగిన, తపనీయ = బంగారముయొక్కయు, మణిమయ = రత్నములయొక్కయు వికారములయిన, గోపుర ప్రాసాద = రాజగృహములను, సౌధ = మేడలను, హర్మ్యములు = ధనవంతులగృహములను, చూచి, మనము = మనస్సు, బ్రహ్మ ఆనందము = గొప్పసంతోష

మును, పొందన్ =పొందఁగా, కడున్ =మిక్కిలి, ఉబ్బి=ఉబికి, సంతోషబాష్పములన్ = సంతోషముచేఁ గలిగిననీళ్లు, జడిగొనంగన్ = ఎడతెగకుండఁగా, ప్రకట=ప్రసిద్ధము, ఐ విలసిల్లు = అయి ప్రకాశించునట్టి, ఒకవధూమణి = ఒకస్త్రీరత్నముయొక్క, మందిరమునన్ = ఇంటియందు, ఇంతులు = స్త్రీలు, చామరలు = వింజామరలను, వీవన్ = విసరఁగా, తనరు = ప్రకాశించునట్టి, మృదు = మెత్తని, హంసతూలికాతల్పమందున్ = హంసల యీఁకలతోఁ జేయఁబడిన పాన్పునందు, తానున్ = కృష్ణుఁడును, ప్రియయును = భార్యయును, బహువినోదములన్ = పెక్కుక్రీడలచేత, తనరి= ఒప్పి, మహిత = పూజింపఁబడిన, లావణ్య = చక్కఁదనముచేత, మన్మథమన్మథుండు=మన్మథునికి మన్మథుఁడైనవాఁడు, (మన్మథునికంటెఁ జక్కనివాఁడు.) అనఁగన్ = అనునట్లు, చూపట్టు=కనఁబడునట్టి, పుండరీక ఆయత అక్షున్ =తెల్లతామరవలె వెడల్పయిన కన్నులు గలవానిని.

తా. పదునాఱువేల స్త్రీలకు నుండుటకుఁ దగి మిక్కిలి గొప్పదైన బంగారుచేతను మణులచేతను గట్టఁబడిన గోపురములను మేడలను జూచి ఆ కుచేలుఁడు మిక్కిలి సంతోషించి పోవుచు ఒక స్త్రీగృహమునందు స్త్రీలు చామరములు వీచుచుండఁగా హంసతూలికాతల్పమునందుఁ దాను భార్యయును వినోదించుచున్న మిక్కిలి చక్కనివాఁడైనకృష్ణుని.

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు. 20

టీ. ఇందీవరశ్యాముఙ్ = నల్లకలువలవలె నల్లనివానిని, వందితసుత్రాముఙ్ = నమస్కరించుచున్న ఇంద్రుఁడు కలవానిని, కరుణాలవాలుఙ్ = దయకు పాదైనవానిని, భాసురకపోలుఙ్ = ప్రకాశించుచున్న చెక్కిళ్లు కల వానిని, కౌస్తుభ అలంకారుఙ్ = కౌస్తుభరత్నము సొమ్ముగాఁగలవానిని, కామితమందారుఙ్ = కోరఁబడినవస్తువులకుఁ గల్పవృక్షమైనవానిని, సురుచిరలావణ్యుఙ్ = మిక్కిలి మనోహరమైన చక్కఁదనము గలవానిని, సురశరణ్యుఙ్ = దేవతలకు రక్షకుఁడైనవానిని, హర్యక్షనిభమధ్యుఙ్ = సింహము నడుమువంటి నడుము గలవానిని, అఖిలలోక ఆరాధ్యుఙ్ = ఎల్లజనులచేఁ బూజింపఁదగినవానిని, ఘనచక్రహస్తుఙ్ = గొప్పచక్రాయుధము చేతియందుఁగలవానిని, జగత్ ప్రశస్తుఙ్ = లోకములచేఁ బొగడఁబడినవానిని, ఖగకుల అధిపయానుఙ్ = పక్షులసమూహమునకు రాజైన గరుత్మంతుఁడు వాహనముగాఁగలవానిని, కౌశేయపరిధానుఙ్ = పట్టువస్త్రము కట్టుపుట్టము గాఁగలవానిని, పన్నగశయనుఙ్ = పాముపాన్పుగాఁగలవానిని, అబ్జాతనయనుఙ్ = కమలమువంటి కన్నులుగలవానిని, మకరకుండలసత్ భూషుఙ్ = మొసలిమోమువలెఁ జేయఁబడిన పోఁగులు మంచిసొమ్ముగాఁగలవానిని, మంజుభాషుఙ్ = చక్కనిమాటలు గలవానిని, నిరుపమ ఆకారుఙ్ = సాటిలేని ఆకారముగలవానిని, దుగ్ధసాగర = పాలసముద్రమునందు, విహారుఙ్ = క్రీడించువానిని, భూరిగుణసాంద్రుఙ్ = గొప్పగుణములచే నిండినవానిని, యదుకుల అంభోధి చంద్రుఙ్ = యదువంశమను సముద్రమునకుఁ జంద్రుని, విష్ణుఙ్ = వ్యాపించువానిని, రోచిష్ణుఙ్ = ప్రకాశించువానిని, జిష్ణుఙ్ = జయము స్వభావముగాఁ గలవానిని, కృష్ణుఙ్ = కృష్ణుని.

తా. కృష్ణుని. అంత్యానుప్రాసము అలంకారము.

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాతుఁ డప్పేదవి
ప్రుని నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగుఁ జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయు న్ఖండోత్తరీయు న్గుచే
లుని నల్లంతనెచూచిసంభ్రమవిలోలుండై దిగెన్దల్పమున్.

టీ. కని = చూచి, డాయన్ = దగ్గఱకు, దళత్ = వికసించిన, కంజాక్షుఁడు = తామరలవంటికన్నులు గలవాఁడు, అశ్రాంత = ఎల్లప్పుడును, దరిద్ర = పేదఱికముచే, పీడితున్ = పీడింపఁబడినవానిని, కృశీభూత = చిక్కిన, అంగున్ = దేహముగలవానిని, జీర్ణ అంబరున్ = చినిఁగిన గుడ్డలుగలవానిని, ఘనతృష్ణా ఆతురచిత్తున్ = మిక్కిలియాశచేఁ బీడింపఁబడుచున్న మనస్సుగల వానిని, హాస్య = పరిహాసమునకు, నిలయున్ = ఆస్పదమైనవానిని, ఖండఉత్తరీయున్ = తునుకలైన అంగవస్త్రముగలవానిని, కుచేలుని, అల్లంతన్ = ఎంతోదూరముననే, చూచి, సంభ్రమ = వేగిరపాటుచే, విలోలుండై = కదలుచున్నవాఁడై, తల్పమున్ = పాన్పునుండి, దిగెన్.

తా. అట్లు కృష్ణునిఁ జూచి దగ్గఱకుఁ బోవునంతలోఁ గృష్ణుఁడు పేదబ్రాహ్మణుని (కుచేలుని) చూచి వేగిరపడి పాన్పునుం డిదిగె.

క. కర మర్థి నెదురుగాఁ జని
పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా
దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దనతల్పమునన్. 22

టీ. కరము = మిక్కిలి, అర్థిన్ = ప్రీతితో, పరిరంభణము = కౌఁగిలింతను, ఆచరించి = చేసి, బంధుస్నేహస్ఫురణన్ = చుట్టమునందలి స్నేహముయొక్క ప్రకాశముతో, తోడ్తెచ్చి = వెంటఁబెట్టుకొనివచ్చి, సమాదరమునన్ = మిక్కిలిప్రేమతో.

తా. కృష్ణుఁడు మిక్కిలిప్రీతితో నెదురుగాఁ బోయి కుచేలుని కౌఁగిలించుకొని చుట్టమునువలెఁ దీసికొనివచ్చి తనపాన్పునందుఁ గూర్చుండఁ బెట్టుకొనెను.

తే. అట్లు కూర్చుండఁ బెట్టి నెయ్యమునఁ గనక
కలశసలిలంబుచేఁ గాళ్లు గడిగి భక్తిఁ
దజ్జలంబులు దనమస్తకమునఁ దాల్చి
లలితమృగమదఘనసారమిళితమైన. 23

టీ. నెయ్యమునన్ = ప్రీతితో, కనకకలశసలిలంబుచేన్ = బంగారు చెంబునందలినీటిచేత, తజ్జలములు = ఆనీళ్లను, మస్తకమునన్ = తనతలయందు, తాల్చి = ధరించి, లలిత = మనోహరమైన, మృగమద = కస్తురితోను, ఘనసార = పచ్చకర్పూరముతోను, మిళితము = కూడినది, ఐన = అయినట్టి.

తా. కృష్ణుఁడు కుచేలునిఁ గూర్చుండఁబెట్టుకొని ప్రీతితో నాతని పాదములను గడిగి ఆనీళ్లను తలపైఁ జల్లుకొని కస్తూరితోఁ గూడినదియైన.

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత
శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి
బంధురామోదకలితధూపంబు లొసఁగి
మించుమణిదీపముల నివాళించి మఱియు. 24

టీ. మలయజము = గంధమును, మేనన్ = ఆదేహమునందు, జొబ్బిల్లన్ = నిండునట్లు, అలఁది = పూసి, అంతన్ = పిమ్మట, శ్రమము = బడలిక, పాయంగన్ = పోవునట్లు, తాళవృంతమునన్ = విసనకఱ్ఱచేత, విసరి = వీచి, బంధుర = మనోహరములైన, ఆమోదకలిత = వాసనలతోఁగూడిన, ధూపములు, ఒసఁగి = ఇచ్చి, మించు = ప్రకాశించునట్టి, మణిదీపములన్ = రత్నాలదీపములచే, నివాళించి = ఆరతెత్తి, మఱియుం.

తా. దేహమంతయుం గందముపూసి విసనకఱ్ఱచే, విసరి ధూపదీపంబు లొసఁగి.

వ. సురభికుసుమమాలికలు సిగముడిం దుఱిమి కర్పూరమిళిత తాంబూలంబు లిడి ధేనువు నొసంగి సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పు డవ్విప్రునకు మేనం బులకాంకురంబు లంకురింప నానందబాష్పజలబిందుసందోహం బయ్యె నట్టి

యుడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణంబులు మొరయం జామరములు వీవం దజ్జాతవాతంబు ఘర్మసలిలంబు నివారించుచుండం జూచి శుద్ధాంతకాంతానివహంబులు తమమనంబుల నద్భుతం బంది యిట్లనిరి. 25

టీ. సురభికుసుమమాలికలు = మంచివాసనగలపూలదండలను, సిగముడిన్ = జుట్టుముడియందు, తుఱిమి = దోఁపి, కర్పూరమిళితతాంబూలంబులు = పచ్చకర్పూరముతోఁ గూడినతాంబూలములను, ఇడి = ఇచ్చి, ధేనువున్ = (మధుపర్కము కొఱకైన) ఆవును, ఒసంగి = ఇచ్చి, సాదరంబుగాన్ = ప్రీతితోఁగూడునట్లుగా, స్వాగతంబు = మంచిరాకను, అడిగినన్, అవ్విప్రునకు = ఆకుచేలునకు, మేనన్ = దేహమునందు, పులకఅంకురంబులు = మొలకలవంటిగగుర్పులు, అంకురింపన్ = కలుగఁగా, ఆనందబాష్పజలబిందుసందోహమునందు = సంతోషముచేఁ గలిగినకన్నీళ్లబిందువుల సమూహమున మునింగినవాఁడు, అయ్యెన్, అట్టియెడన్ = ఆసమయమునందు, పద్మలోచనుండు = కృష్ణుఁడు, మన్నించు = గౌరవించు, అంగనామణి = స్త్రీరత్నమగురుక్మిణీదేవి, కరకంకణంబులు = చేతికడియములు, మొరయన్ = ధ్వనించునట్లు, చామరములు = వింజామరలను, వీవన్ = విసరఁగా, తత్ జాతవాతంబు = ఆచామరములవలనఁగలిగినగాలి, ఘర్మసలిలంబు = చెమటనీటిని, నివారించుచుండన్ = పోఁగొట్టుచుండఁగా, శుద్ధాంతకాంతానివహంబులు = అంతఃపురమునందలి స్త్రీజనుల సమూహములు, అద్భుతంబు = ఆశ్చర్యమును, అంది = పొంది.

ఉ. ఏమితపంబు చేసెనొకొ యీధరణీదివిజోత్తముండు తొ
ల్లామున; యోగివిస్ఫురదుపాసనుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథునిజతల్పమునన్వసియించియున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

టీ. ఈధరణీదివిజోత్తముండు = ఈబ్రాహ్మణశ్రేష్ఠుఁడైన కుచేలుఁడు,

తొల్ బామునన్ = పూర్వజన్మమునందు, యోగివిస్ఫురత్ ఉపాసనుఁడు ఐ=ఋషులయొక్క ప్రకాశించుచున్న ఉపాసనగలవాఁడై, తనరారు = ఒప్పుచున్న, ఈజగత్స్వామి = ఈలోకములకుఁ బ్రభువైన, రమాధినాథుం = లచ్చిమగఁడైనకృష్ణునియొక్క, నిజతల్పమునన్ = తనదగుపాన్పునందు, ఈమహనీయమూర్తికిన్ = పూజింపఁదగిన యాకారము గలవానికి, మునిపుంగవులు = ఋషిశ్రేష్ఠులు, ఎంతవారలున్ = ఎంతగొప్పవారలును, ఎనయే=సాటియా? కారనిభావము.

తా. ఈబ్రాహ్మణోత్తముఁడు పూర్వజన్మమున నెంత పుణ్యముచేసెనో తెలియదు. యోగులచే ధ్యానింపఁబడువాఁడును, లోకములకుఁ బ్రభువును, లక్ష్మికి మగఁడైన యాకృష్ణునిపాన్పునం గూర్చుండి యున్నాఁడు. ఎంతటిగొప్పఋషులును వీనికి సమానులు కారు.

వ. అదియునుంగాక. 27

తా. అట్లు కృష్ణుఁడు కుచేలుని బూజించుటయే కాక.

చ. తనమృదుతల్పమందు వనితామణి యైనరమాలలామ పొం
దును నెడగాఁ దలంపక యదుప్రవరుం డెదు రేఁగి మోదము
న్దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచు
న్వినయమునన్భజించె ధరణీసురుఁ డెంతటిభాగ్యవంతుఁడో.

టీ. తనమృదుతల్పమందున్ = తనమెత్తనిపాన్పునందు, వనితామణి=స్త్రీరత్నము, ఐనరమాలలామపొందున్ = అయిన యుత్తమురాలగు లక్ష్మీదేవియొక్క కూడికయు, ఎడ = దూరము, కాన్ = అగుటనుకూడ, తలంపక = ఎన్నక, యదుప్రవరుండు=యాదవులలోశ్రేష్ఠుఁడైన కృష్ణుఁడు, ఏఁగి=పోయి, మోదమున్=సంతోషమును, తనుకఁగన్=కలుగునట్లు, ఉచితక్రియలన్=తగినపనులచేత, పరితుష్టున్=సంతోషించినవానిని, వినయమునన్=అడకువచేత, భజించెన్= సేవించెను. ధరణీసురుఁడు=పుడమివేల్పు, (కుచేలుఁడు.) ఎంతటిభాగ్యవంతుఁడో=ఎంతటియదృష్టముకలవాఁడో.

తా. కృష్ణుఁడు తాను రుక్మిణి పాన్పునందు వినోదముగా నుండునప్పుడుగూడ రుక్మిణిని విడిచి ఆబ్రాహ్మణుని కెదురుగాఁబోయి సంతోషముతోఁ

గాఁగిలించుకొని తగినమర్యాదలచే సంతోషింపఁజేసెను. కావున ఆబ్రాహ్మణుఁడు మిక్కిలి పుణ్యాత్ముఁడు.

వ. అయ్యవసరంబున. 29

క. మురసంహారుఁడు కుచేలుని
కరము గరంబునఁ దెమల్చి కడఁక న్మన మా
గురుగృహమున వర్తించిన
చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్. 30

టీ. మురసంహారుఁడు = కృష్ణుఁడు, కుచేలుని, కరము=చేతిని, కరంబునన్ = తనచేతితో, తెమల్చి=పట్టి, కడఁకన్=పూనికతో, మనము-కుచేలుఁడును కృష్ణుండుననుట, ఆగురుగృహమునన్=ఆగురువుయొక్క (సాందీపుని) యింటియందు, వర్తించిన చరితములు=నడపిననడవళ్లు, నుడివి=చెప్పి, చతురతన్=నేర్పుచేత.

తా. కృష్ణుఁడు కుచేలునిచేతిని దనచేతితోఁ బట్టుకొని మనము గురువు నింటియందుఁ జేసినపనులు జ్ఞప్తియున్నవా అని కొన్ని చెప్పి నేర్పుతో.

సీ. బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధ
కృత గలచారువంశంబువలనఁ
పరిణయం బైనట్టిభార్య సుశీలవ
ర్తనములఁ దగ భవత్సదృశ యగునె
తలఁప గృహక్షేత్రధనదారపుత్త్రాదు
లందు నీచిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది యేను దుది లోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి మనంబునఁ గామమోహితులు గాక
నర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠఁ
దవిలి యుందురు కొంద ఱుత్తములు భువిని. 31

టీ. బ్రాహ్మణ ఉత్తమ = బ్రాహ్మణులయందు మేటియైనవాఁడా! ఓ కుచేలా! వేదపాఠనలబ్ధదక్షత = వేదములఁ జదివించుటయందుఁ బొందఁబడిన నేర్పరితనము, కలచారువంశంబువలనన్ = కలిగినట్టి మంచికులమునుండి, పరిణయంబు = వివాహము, ఐనట్టిభార్య, సుశీలవర్తనములన్ = మంచిస్వభావమునందును నడవడియందును, తగన్ = ఒప్పునట్లు, భవత్సదృశ=నీకు సరియైనది, అగునె=కలిగియున్నదా? తలఁపన్=ఆలోచింపఁగా, గృహక్షేత్రధనదారపుత్త్ర ఆదులందున్ = ఇల్లు చేను ధనము భార్య కొడుకులు మొదలుగాఁగలవానియందు, నీచిత్తంబు=నీమనస్సు, చెందక ఉంట = తగులకుండుట, ఏను, తుదిన్ = కడపట, లోకసంగ్రహార్థంబు=జనుల ననుగ్రహించుటకొఱకు—జనులను కర్మఁజేయునట్లు చేయుటకొఱకనుట, చేయుంగతిన్ = చేయువిధమున, తోఁచుచున్నది=కనఁబడుచున్నది. భువిని=భూమియందు, కామమోహితులు = కామముచేత మోహింపఁజేయఁబడినవారలు, కాక, అర్థిమైన్ = ప్రీతితో, యుక్తకర్మంబులు = తగిన కర్మములను, ఆచరించి = చేసి, ప్రకృతిసంబంధమును=అజ్ఞానముతోడికూడికను, పాసి=వదలి, భవ్యనిష్ఠన్ = మోక్షమునందలియాసక్తిని, తవిలి=కోరి.

తా. వేదములు తెలిసినకులమునందు నీవు పెండ్లిచేసికొన్న భార్య నీవలె మంచిస్వభావమును, నడతయును గలిగియున్నదిగదా! నీవు గృహము మొదలగువానిమీఁదఁ బ్రీతిలేక కర్మములు చేయుటచూడఁగా, నేను నాకు ఏకర్మముఁ జేయవలసినది లేకయున్నప్పటికిని, జనులు కర్మపరు లగుటకొఱకు కర్మ చేయునట్లున్నది. నీవలెఁ గామమునకు లోఁబడక శాస్త్రమునందుఁ జేయవలసినట్లు చెప్పఁబడినకర్మములను జేయుచు నజ్ఞానమునందలి మోక్షము మాత్రమే కోరునట్టి యుత్తములు భూమియందుఁ గొందఱే యుందురు.

వ. అని మఱియు నిట్లనియె. 32

క. ఎఱుఁగుదె గురుమందిరమున
దెఱఁ గొప్పఁగ మనకు నతఁడు తెలియఁ దెలుపఁగాన్
ఎఱుఁగఁగ వలసినయర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్. 33

టీ. గురుమందిరమునన్ = గురువుయొక్క ఇంటియందు, తెఱఁగు = విధము, ఒప్పన్ కన్ = తగునట్లు, అతఁడు= ఆగురువు, మనకున్=కృష్ణునకు, కుచేలునికి, తెలియన్, తెలుపన్ కాన్ = తెలియఁజేయఁగా, ఎఱుఁగన్ కన్=తెలియుటకు, వలసిన అర్థములు=ఆవశ్యకమైనవిషయములను, ఎఱిఁగి= తెలిసి, పరిజ్ఞానమహిమలు = తెలివియొక్క గొప్పతనములను, ఎఱుఁగుటలు = తెలిసికొనుటలను, ఎల్లన్ =అంతయును, ఎఱుఁగుదువు= తెలియుదువుకదా !

తా. మనము గురువునింట నుండునపుడు గురువు చెప్పఁగాఁ జదువు కొన్న విధమంతయు నీవు తలంతువుకదా!

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె. 34

టీ. మఱియున్=పిమ్మట, గురుప్రశంస=ఆచార్యుఁ డగుసాందీపనిఁ బొగడుట.

తే. తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు
నవ్యయం బైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డఖిల
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు. 35

టీ. తివిరి = పూని, అజ్ఞానతిమిరప్రదీపము = అజ్ఞానము అనుచీఁకటికి దీపము, అగుచున్, అవ్యయంబు = నాశములేనిది, ఐనబ్రహ్మంబున్ = అయినట్టిబ్రహ్మమును, అనుభవించుభరితసత్త్వుండు = తెలియునట్టినిండినసత్త్వ గుణముకలవాఁడు, సత్కర్మనిరతుఁడు = మంచికర్మములయం దాసక్తిగల వాఁడు, అఖిల భూసురశ్రేష్ఠుఁడు = ఎల్లపుడమివేల్పులయందు నుత్తముఁడు, అనఘుండు = పాపములేనివాఁడు, బుధనుతుండు = పండితులచేఁ బొగడఁబడిన వాఁడు.

తా. గురు వగుసాందీపుఁనియజ్ఞానమును బోఁగొట్టునట్టిబ్రహ్మమును దెలిసినవాఁడనియు మిక్కిలి సత్త్వగుణమును గలవాఁడనియు మంచికర్మములు చేయువాఁడనియు బ్రాహ్మణులలో నెల్ల నుత్తముఁడనియు పాపము లేనివాఁడనియుఁ బండితులచేఁ బొగడఁబడువాఁ డనియు. అలంకారము రూపకము.

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞాన
ప్రదుండ నగుగురుండ నై యుండియు గురుభజనంబు పర
మ ధర్మం బని యాచరించితి నది గావున. 36

టీ. అమ్మహాత్ ఆత్మునివలనన్=ఆగొప్పప్రభావముగలసాందీపనివలన- నేను, కృష్ణుఁడు, సకలవర్ణాశ్రమంబులవారికిన్=ఎల్లజాతులవారికిని, ఎల్లఆశ్రమములవారికిని, విజ్ఞానప్రదుండను=తెలివినిచ్చువాఁడను, అగుగురుండనునై = అగుఆచార్యుఁడనై, గురుభజనంబు = గురువుయొక్క సేవించుట, పరమధర్మంబు=గొప్పధర్మము, ఆచరించితిన్ = చేసితిని, అదికావునన్ = అట్లగుటచేత.

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకలకులాశ్రమంబులందుల నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన
దేశికుఁ డన నొప్పు చుందు ధృతి నెల్లెడలన్. 37

టీ. భూసురులకెల్లన్ = బ్రాహ్మణులకందఱకును, ముఖ్యుఁడనై = మిక్కిలి కావలసినవాఁడనై, ఎపుడున్ = ఎల్లప్పుడును, సకలకులఆశ్రమంబులందున్ = ఎల్లజాతులయందును, ఆశ్రమములయందును, ధీసుజ్ఞానప్రదుఁడు= బుద్ధియందుఁ దెలివినిచ్చువాఁడు, అనన్ =అనఁగా, దేశికుఁడుఅనన్ = ఆచార్యుఁడుఅనునట్లు, ధృతిన్=దిట్టతనముచేత, ఎల్లఎడలన్=అన్నిచోట్లను, ఒప్పుచున్ = ప్రకాశించుచు, ఉందున్.

తా. నేను బ్రాహ్మణులకు కావలసినవాఁడై యెల్లజనులకు జ్ఞానము నిచ్చునట్టి గురువునై యున్నాఁడను.

తే. అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే భవార్ణవము వెలుచ
దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరత. 38

టీ. అట్టివర్ణ ఆశ్రమంబులయందుఁ = అట్టిజాతులయందును ఆశ్రమములయందును, అర్థకుశలులు = కార్యములయందు సమర్థులు, అగువారు, మత్పదఅంబుజధ్యానపరతన్ = నాయొక్క కమలములవంటి పాదముల యొక్క తలఁచుటయందు ఆసక్తులైయుండుటచేత, నిఖిలఏకగురుఁడను = ఎల్లవారికిని ఒక్కఁడైన ఆచార్యుఁడను, ఐననాదువాక్యంబుచేన్ = అయిన నాయొక్కమాటచేత, వెలుచన్ = శీఘ్రముగా, భవఅర్ణవము = సంసారము అను సముద్రమును, దాఁటుదురు.

తా. అట్టి వర్ణాశ్రమధర్మములను జక్కఁగాఁజేయునట్టి నాభక్తులు నాయొక్క యుపదేశమువలన సంసారమునుండి ముక్తులగుదురు.

వ. అదియునుంగాక సకలభూతాత్మకుండ నైనయేను దపోవ్రత యజ్ఞదానశమదమాదులచేత సంతసింపను. గురుజనంబులఁ బరమభక్తిసేవించువారలం బరిణమింతు అని చెప్పి మఱియు మనము గురుమందిరమున నున్నయెడ గురుపత్నీనియుక్తుల మై యింధనార్థం బడవికిం జనినయెడ. 39

టీ. సకలభూతఆత్మకుండను = ఎల్ల భూతములు స్వరూపముగాఁగల వాఁడను, ఐనఏను = అయినట్టి నేను, తపః వ్రత యజ్ఞ దాన శమదమఆదుల చేతన్ = తపస్సు నోములు యజ్ఞము దానము అంతరింద్రియనిగ్రహము (మనస్సుయొక్కనిగ్రహము,) వెలుపలి యింద్రియనిగ్రహము మొదలగు వానిచేత, సంతసింపను = సంతోషింపను, గురుజనంబులన్ = గురువులయినజనులను, పరమభక్తిన్ = ఎక్కుడుభక్తిచేత, సేవించువారలన్ = కొలుచువారినిఁ గూర్చి, పరిణమింతున్ = సంతోషింతును. మనము, కృష్ణుఁడును, కుచేలుఁడును, గురుమందిరమునన్ =గురువునింటియందు, ఉన్నయెడన్ = ఉన్నప్పుడు, గురుపత్నీనియుక్తులము ఐ=గురుభార్యచే నాజ్ఞాపింపఁబడినవారమై, ఇంధనార్థంబు= కట్టెలకొఱకు, చనినయెడ=పోయినప్పుడు.

సీ. ఘుమఘుమారావసంకుల ఘోరజీమూత
పటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ

జటులఝంఝానిలోత్కటసముద్ధూతనా
నావిధజంతుసంతాన మగుచుఁ
జండదిగ్వేదండతుండనిభాఖండ
వారిధారాపూర్ణవసుధ మగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణజి
ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు
తే. నడరి జడి గురియ నినుండు నస్తమింప
భూరినీరంధ్రనిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు
గానియట్లుండ మనము నవ్వానఁ దడిసి. 40

టీ. ఘుమఘుమ=ఘుమఘుమయను, ఆరావ=ధ్వనితో, సంకుల=కూడిన దియు, ఘోర=భయంకరమైన, జీమూత=మేఘములయొక్క, పటల = సమూహముచేత, సంఛన్న=కప్పఁబడిన, అభ్రభాగము = ఆకాశప్రదేశము కలది, అగుచున్, చటుల = సమర్థములైన, ఝంఝానిల = వానతోడి గాలిచేత, ఉత్కట = మిక్కిలి, సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, నానావిధములైన, జంతు = ప్రాణులయొక్క, సంతానము=సమూహముకలది, అగుచున్, చండ = మిక్కిలి కోపముగల, దిక్ = దిక్కులయందలి, వేదండ =ఏనుఁగుల యొక్క, తుండ=తొండములతో, నిభ=సమానమైన, అఖండ = ఎడతెగని, వారిధారా = ఉదకధారలచేత, పూర్ణ=నిండిన, వసుధము = భూమికలది, అగుచున్, విద్యోతమాన = ప్రకాశించుచున్న, ఉగ్ర = భయంకరుఁడైన, ఖద్యోత = సూర్యునియొక్క, కిరణ = కిరణములను, జిత్ = జయించునట్టి, విద్యుత్ = మెఱుపులయొక్క, ద్యుతి = కాంతులయొక్క, ఛటా = సమూహముయొక్క, విభవము = అతిశయముకలది, అగుచున్, అడరి = అతిశయించి, జడి=వాన, కురియన్ = కురియఁగా, ఇనుండున్ = సూర్యుఁడు, అస్తమింపన్ = మఱుఁగుపడఁగా, భూరి = మిక్కిలి, నీరంధ్ర = సందులేనిది, నిబిడ=దట్టమునైన, అంధకారము=చీఁకటి, ఏచి = అతిశయించి,

సూచికా=సూదిచేతను, అభేద్యము౽ఐ=భేదింపరానిదై, మిక్కిలిదటమై, వస్తుగోచరంబు = పదార్థములయొక్క అగపడుట, కానియట్లుండఁగ, మనము= మనమిద్దఱమును.

తా. మేఘములు ఘుమఘుమధ్వనులతోఁ గూడి భయంకరములై ఆకాశప్రదేశమును కప్పుకొని గాలివానచేత నానావిధములైన జంతువులు పీడింపఁబడుచు దిగ్గజములతొండములతో సమానము లైననీటిధారలచేత భూమినిండునట్లును, సూర్యకిరణముకంటె కాంతిగల మెఱుపులసమూహము వ్యాపించునట్లు వానగురియుచుండఁగా సూర్యాస్తమానమై సూదిగ్రుచ్చుటకును సందులేనియట్లు చీఁకటి గ్రమ్మియుండఁగా మన మావానలోఁ దడిసి.

తే. బయలు గొందియుఁ బెనుమిట్టపల్లములును
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్నయత్తఱి మన మొకరొకరిచేతు
లూఁతఁగాఁ గొని నడచుచు నుండ౽నంత. 41

టీ. బయలు=ఎడారియు, గొందియుఁగ = సందును, పెనుమిట్ట=పెద్దమెరకయు, రహితసహితస్థలంబులు = విడువఁబడినదియు కూడినదియునైన ప్రదేశములు, ఏర్పఱుపరాక=నిశ్చయింపరాక, అత్తఱిఁగ =ఆసమయమునందు, ఊఁతఁగాఁగ = ఆధారముగా, కొని, పట్టుకొని.

తా. ఇది బయలు, ఇది సందు, ఇది మిట్ట, ఇది పల్లము అని తెలిసికొఁజాలనిసమయమునందు మనము ఒకరొకరిచేతు లొకరుపట్టుకొని నడుచుచుండఁగా.

క. బిసబిస నెప్పుడు నుడుగక
విసరెడివలిచేత వడఁకు విడువక మనముఁగ
దెసచెడి మార్గముఁ గానక
మసలితి మంతటను నంశుమంతుఁడుఁ బొడిచెన్. 42

టీ. బిసబిసఁగ = వేగముగా, ఉడుగక=విడువక, విసరెడివలిచేతఁగ= కొట్టునట్టిగాలిచేత, వడఁకు=వణఁకును, దెసచెడి = దిక్కుదోఁపక, మార్గము=

జారిని, మసలితిమి = ఆలస్యము చేసితిమి. అంతటను=పిమ్మట, అంశుమంతుఁడు=సూర్యుఁడు, పొడిచెన్ = ఉదయించెను.

తా. మిక్కిలి వేగముగా విసరుచున్న యెడతెగని గాలిచేత వణఁకుచు మనము దారి తెలియక అడవిలోనుంటిమి. అంతట సూర్యుఁ డుదయించెను.

క. తెలతెలవాఱెడివేళన్
గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్
మిలమిలనిప్రొద్దుపొడుపున
తళతళ యనుమెఱుఁగు దిగ్వితానము నిండెన్. 43

టీ. పక్షిగణము=పక్షులసమూహము, మిలమిలని ప్రొద్దుపొడుపునన్=మిసమిసయను సూర్యునియుదయముచేత, మెఱుఁగు = కాంతి, దిక్ వితానము=దిక్కులయొక్క సమూహమునందు.

తా. తెల్లవాఱునపుడు పక్షులు కూసెను. సూర్యోదయమునందు తళతళ మను కాంతులసమూహము దిక్కులయందు వ్యాపించెను.

క. అప్పుడు సాందీపని మన
చొప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం
దెప్పిఱిలుటఁ గని ఖేదం
బుప్పతిలం బలికె నకట యోవటులారా! 44

టీ. సాందీపని = మనగురువగుసాందీపని, మనచొప్పన్=మనజాడను, అరయుచున్=విచారించుచు, వానసోఁకునను = వానతాఁకుడుచేత, వలిన్=చలినుండి, తెప్పిఱిలుటన్=తేఱుటను, కని = చూచి, ఖేదంబు = దుఃఖము, ఉప్పతిలన్ = కలుగఁగా, పలికెన్=చెప్పెను, అకట = అయ్యో! ఓవటులారా=ఓబ్రహ్మచారులారా! (కృష్ణకుచేలుర సంబోధనము.)

తా. అప్పుడు సాందీపని మనలను వెదకుచువచ్చి వానదెబ్బకుఁదప్పించుకొనియున్న మనలను జూచి దుఃఖముతో నిట్లు చెప్పెను.

చ. కటకట యిట్లుమాకొఱకుఁగాఁ జనుదెంచిమహాటవిన్ సము
త్కటపరిపీడ నొందితిరి గావున శిష్యులు మాఋణంబు నీఁ
గుట కిది కారణంబు సమకూరెడిఁబోయింటమీఁదమీకు వి
స్ఫుటధనబంధుదారబహుపుత్త్రవిభూతిజయాయురున్నతుల్.

టీ. కటకట=అయ్యయ్యో! చనుదెంచి = వచ్చి, మహాత్ అటవిన్ = గొప్పయడవియందు, సముత్కటపరిపీడన్ = మిక్కిలి అధికమైనబాధను, ఒందితిరి=పొందితిరి. కావునన్ = కాఁబట్టి. శిష్యులు = ఓశిష్యులారా! మాఋణంబు=మాయప్పును, ఈఁగుటకున్=తీర్చుటకు, ఇది=ఇట్లుకష్టపడుట, కారణంబు=హేతువు, ఇటమీఁదన్=ఇంకముందు,మీకున్=కృష్ణకుచేలురకు, విస్ఫుట = స్పష్టములయిన, ధన, బంధు, దార = భార్యలును, బహుపుత్త్ర=పెక్కుకొడుకులును, విభూతి=ఐశ్వర్యమును,జయ=గెలుపును, ఆయుః=ఆయుస్సును, ఉన్నతుల్ = గొప్పదనములును, సమకూరెడిన్ పో=కలుగును సుమా.

తా. మాకొఱకు అడవికిఁ బోయి మిక్కిలి బాధపడితిరి. కావున, శిష్యులారా! మాఋణమును దీర్చుకొంటిరి. ఇంక మీకు ధనము మొదలగునవి కలుగును.

క. అని గారవించి యాయన
మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకున్
జనుదెంచుట లెల్లను నీ
మనమునఁ దలఁతే యటంచు మఱియు న్బలికెన్. 46

టీ. గారవించి=బుజ్జగించి, ఆయన=గురువగు సాందీపని, మనలన్ = కృష్ణకుచేలురను, తోడ్కొనుచున్ = వెంటఁబెట్టుకొనుచు, ఆత్మమందిరమునకున్ = తనయింటికి, చనుదెంచుటలు = వచ్చుటను, తలఁతు ఎ = తలంతువా ?

తా. ఇట్లుచెప్పి మనగురువు మనలను బుజ్జగించి తనయింటికిఁదెచ్చిన సమాచారములు జ్ఞప్తికలిగి యున్నవా యని మరల నిట్లుచెప్పెను.

వ. అనఘా మన మధ్యయనంబుసేయుచు నన్యోన్యస్నేహవా
త్సల్యంబులం జేయుకృత్యంబులు మఱవవుగదా యని యని
యెల్లం దలంచి యాడుమాధవుమధురాలాపంబులు విని
యతనిఁ గనుంగొని కుచేలుం డిట్లనియె. 47

టీ. అనఘా=పాపములేనివాఁడా! ఓ కుచేలుఁడా! అధ్యయనంబు=వేద మునుచదువుటను, అన్యోన్యస్నేహవాత్సల్యంబులన్ = ఒకరొకరియందలిచెలిమి చేతను, ప్రేమచేతను, చేయుకృత్యంబులు = చేసినపనులను, అతనిన్=ఆకృష్ణుని, కనుంగొని = చూచి.

క. వనజోదర గురుమందిర
మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం
పనిపను లెవ్వియుఁ గలవే
విను మది యట్లుండనిమ్ము విమలచరిత్రా. 48

టీ. వనజఉదర=కమలము గర్భమునందుఁ గలవాఁడా (కృష్ణునిసంబోధనము). మందిరమునన్ = ఇంటియందు, మనము=కుచేలకృష్ణులు, వసించునాఁడు = ఉండునప్పుడు, ముదమునన్=సంతోషముతో, కావింపనిపనులు= చేయని కార్యములు, ఎవ్వియున్=ఏవైనను, కలవువే=ఉన్నవా? అవి = ఆపనులను, విమలచరిత్రా = పరిశుద్ధమైననడవడికలవాఁడా! (కృష్ణునిసంబోధనము.)

తా. కృష్ణా! మనము గురువునింటియందున్నపుడు ఎన్నికార్యములో చేసితిమి. పరిశుద్ధమైన నడవడి గలవాఁడా! వినుము.

క. గురుమతిఁ దలఁపఁగ ద్విజగ
ద్గురుఁడ వనం దగిననీకు గురుఁ డనఁ దా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ
కరయంగ విడంబనంబు లగుఁ గాదె హరీ. 49

టీ. హరీ=కృష్ణా! గురుమతిన్=గొప్పబుద్ధిచేత, తలఁపఁగన్=ఆలోచింపఁగా, త్రిజగత్ గురుఁడవు=ముల్లోకములకు గురువు; అనన్=అనిచెప్పుటకు, గురుఁడుఅనన్=గురుఁడనఁగా, తాను, ఒండుఒకరుఁడు=ఇంకొకఁడు, ఎవ్వఁడు, అరయంగన్ = ఆలోచింపఁగా, ఇంతయును-గురుశిష్యభావము అనుట, నీకున్=కృష్ణునకు, విడంబనంబులు = మాయలు, అగున్ కాదె = అవునుకదా?

తా. కృష్ణా! ముల్లోకములకు గురువగు నీకు ఎవఁడును గురువుగాఁ జాలఁడు. అయినను నీవు సాందీపనికి శిష్యుఁడవయి యుండుటవలన.

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్తభావాభిజ్ఞుం డైనపుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుం డగుచు నతనిం జూచి నీ విచ్చటికి వచ్చునపుడు నాయందుల భక్తింజేసి నాకు నుపాయనంబుగా నేమిపదార్థంబు దెచ్చితివి, అప్పదార్థంబు లేశమాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు అట్లుంగాక నీచవర్తనుం డై మద్భక్తిందగులనిదుష్టాత్ముండు హేమాచలతుల్యం బైనపదార్థంబు నొసంగిన నదియు నామనమ్మునకు సమ్మతంబు గాదు కావున. 50

టీ. సాభిప్రాయంబుగాన్=అభిప్రాయముతోఁగూడినట్లుగా, పలికిన పలుకులు=చెప్పిన మాటలను, సమస్తభావఅభిజ్ఞుండు = ఎల్లవారి యభిప్రాయములను దెలిసినవాఁడు, ఐనపుండరీకాక్షుండు=అయిన కృష్ణుఁడు, మందస్మితసుందరవదన అరవిందుండు = చిఱునగవుచే నందమైన కమలమువంటి మోముకలవాఁడు, అతనిన్=కుచేలుని, ఉపాయనంబుగాన్ = కానుకగా, ఏమిపదార్థంబు=ఏవస్తువు, లేశమాత్రంబు=మిక్కిలి కొంచెము, అంగీకరింతును = ఒప్పుకొందును, నీచవర్తనుండై = నీచపునడవడికలవాఁడై, మత్ భక్తిన్=నాయందలిభక్తియందు, తగులనిదుష్ట ఆత్ముండు = ఆసక్తుఁడుగాని చెడ్డమనస్సుకలవాఁడు, హేమఅచలతుల్యంబు = బంగారుకొండతోసమానము, అయినపదార్థంబున్=అయినవస్తువును, ఒసంగినన్=ఇచ్చినను, అది

యయును=ఆవస్తువుగూడ, నామనమ్మునకున్ = నామనస్సునకు, సమ్మతంబు = ఇష్టము, కాదు.

తా. కుచేలునిమాటలు విని కృష్ణుఁడు కుచేలునితో నిట్లు చెప్పెను. నీవు నామీఁదిభక్తిచే నాకుఁ గానుక యేమి తెచ్చితివి? భక్తితోఁ గొంచెము తెచ్చినను దానికి నేను సంతోషింతును. భక్తిలేక యధికమిచ్చినను నేను దానినొల్లను.

క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిం
గొలిచినజను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్. 51

టీ. పాయనిభక్తిన్=విడువనిభక్తిచేత, కొలిచినజనులు=సేవించినమనుష్యులు, దళము ఐనన్=ఆకైనను, సలిలమైనన్ = నీరైనను, అర్పించినన్ = ఇచ్చినయెడ, ఏను=కృష్ణుఁడు, రుచిరఅన్నముగన్=రుచిగలయన్నముగానే, ఎలమిన్=సంతోషముతో, భుజింతున్=ఆరగింతును.

తా. భక్తులయినవారు ఆకు మొదలగునవి సమర్పించినను దానిని నేను సంతోషముతో మంచియన్నముపలె గ్రహింతును.

క. అని పద్మోదరుఁ డాడిన
వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె
చ్చినయడుకులు దగ నర్పిం
పను నేరక మోము వాంచి పలుకక యున్నన్. 52

టీ. పద్మఉదరుఁడు=కృష్ణుఁడు, ఆడినవినయఉక్తులకున్ = చెప్పినఅణకువతోఁగూడిన మాటలకు, ఆత్మన్=మనస్సునందు, అలరి=సంతోషించి, విప్రుఁడు=బ్రాహ్మణుఁడు-కుచేలుఁడు, తాన్=తాను, తెచ్చిన అడుకులు = తీసికొనివచ్చినఅడుకులను, తగన్=ఒప్పునట్లు, అర్పింపను=ఇచ్చుటకు, నేరక=చాలక, మోము=ముఖము.

తా. అట్లు కృష్ణుఁడు వినయముతో నడుగఁగాఁ గుచేలుఁడు ఆమాట విని సంతోషించి సిగ్గుచేత తాను తెచ్చినఅడుకులను ఇయ్యఁజాలకుండఁగా.

వ. అవ్విప్రుండు చనుదెంచినకార్యంబు కృష్ణుండు దనదివ్యచిత్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపం డైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబునకై నాయొద్దకుఁ జనుదెంచినవాఁడు. ఇతనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబు లైనసంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయునని తలంచి యతండు జీర్ణవస్త్రంబుకొంగున ముడిచి తెచ్చినయయ్యడుకులముడియఁ గని యిది యేమి యని యొయ్యన నమ్ముడియఁ దన కరకమలంబుల విడిచి యయ్యడుకులు కొన్ని పుచ్చుకొని యివి సకలలోకంబులను నన్నును బరితృప్తింబొందింపఁజాలునని యప్పుడు. 53

టీ. అవ్విప్రుండు=ఆబ్రాహ్మణుఁడైన కుచేలుఁడు, చనుదెంచినకార్యంబున్=వచ్చినపనిని, దివ్యచిత్తంబునన్ = (తన) శ్రేష్ఠమైన మనస్సునందు, ఇతండు=ఈకుచేలుఁడు, పూర్వభవంబునన్ = తొలిపుట్టువునందు, ఐశ్వర్యకాముండు ఐ=సంపదను గోరువాఁడై, నన్నున్=కృష్ణుని, సేవింపఁడు=కొలువఁడు. ఐనన్=అయినప్పటికిని, నిజకాంతాముఖ ఉల్లాసంబుకొఱకున్=తన భార్యయొక్కముఖప్రీతికై, ఇంద్రాదులకున్ = ఇంద్రుఁడు మొదలగువారికి, పడయరానిబహుప్రకారంబులు=పొందఁగూడనిఅనేకవిధములు, ఐనసంపత్ విశేషంబులు = అయినట్టి సంపదలయొక్క అతిశయములను, ఈక్షణంబ=ఈనిమిషముననే, ఒడఁగూర్పవలయున్ = కలిగింపవలయును, జీర్ణవస్త్రంబు కొంగునన్=చినిఁగినగుడ్డకొనయందు, ముడిచి=ముడివేసి, ముడియన్ = ముడిని, ఇది=ఈమూట, ఒయ్యనన్=తిన్నగా, తనకరకమలంబులన్=తనకమలములవంటిచేతులచేత, విడిచి=విచ్చి, ఇవి = ఈయడుకులు, సంతృప్తిన్ = సంతోషమును.

క. మురహరుఁడు పిడికెఁడడుకులు
గర మొప్పఁగ నారగించి కౌతుకమతి యై
మఱియును బిడికెఁడు గొనఁ ద
త్కర మప్పుడు పట్టెఁ గమల కరకమలములన్. 54

టీ. మురహరుఁడు=కృష్ణుఁడు, కరము=మిక్కిలి, ఒప్పఁగన్=తగునట్లు, ఆరగించి=తిని, కౌతుకమతియై = సంతోషించిన మనస్సు గలవాఁడై, కొనన్=తీసికొనఁగా, తత్ కరము=ఆకృష్ణుని చేతిని, కమల = లక్ష్మి, కరకమలములన్=కమలములవంటి చేతులచేత, పట్టెన్=పట్టుకొనెను.

తా. కృష్ణుఁడు అడుకులు పిడికెఁడు దిని రెండవపిడికెఁడు దినుటకుఁ బ్రయత్నింపఁగా రుక్మిణి చేయిబట్టి నిలిపెను.

క. సొంపారఁగ నతనికి బహు
సంపద లందింప నివియ చాలును నీఁక భ
క్షింపఁగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ. 55

టీ. త్రిజగత్ సంపత్ కర=ముల్లోకములకును సంపదను చేయువాఁడా! దేవదేవ=దేవతలకు దేవుఁడా ! సర్వాత్మ=అన్నిటికిని ఆత్మయైనవాఁడా! హరీ = పాపములను హరించువాఁడా ! కృష్ణునిసంబోధనములు. సొంపారఁగన్=చక్కఁదనము నిండునట్లు-ఇష్టపూర్తియగునట్లు, అందింపన్ = కలుగఁ జేయుటకు, ఇవియ=ఈఅడుకులే, భక్షింపఁగన్=తినుట, వలవదు=వలదు.

తా. కృష్ణా! ఈకుచేలునకు సంపదలు గలుగుటకు ఈపిడికెఁడుఅడుకులు తినుటయే చాలును. కాఁబట్టి రెండవపిడికెఁడు తినవలదు. అలంకారము పరికరము.

వ. అని యిట్లు వారించె నక్కుచేలుండును నారాత్రి గోవిందు మందిరంబునఁ దనకు హృదయానందకరంబు లగువివిధపదార్థంబు లనుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తన మనంబునందన్ను సమధికస్వర్గభోగానుభవుంగాఁదలంచుచు

మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబులఁ దీర్చి యిందిరారమణుండు దన్నుఁ గొంతద వ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందనసందర్శనానందలోలాత్ముం డై తనమనంబున నిట్లనియె. 56

టీ. వారించెన్ = అడ్డగించెను, గోవిందుమందిరంబునన్ = కృష్ణునిగృహమునందు, తనకున్ = కుచేలునకు, హృదయఆనందకరంబులు = మనస్సునకు సంతోషమును చేయునవి, మృదులశయ్యాతలంబునన్ = మెత్తనిపాన్పుమీఁద, తన్నున్ = కుచేలుని, సమధికస్వర్గభోగఅనుభవున్ కాన్ = మిక్కుటమైన స్వర్గమునందలి సుఖముయొక్క అనుభవముకలవానినిగా, అరుణఉదయంబునన్ = వేకువను, కాలఉచితకృత్యంబులు = కాలమునకుఁ దగినపనులను, తీర్చి = నెఱవేర్చి, ఇందిరారమణుండు = లచ్చిమగఁడు-కృష్ణుండు, తన్నున్ = కుచేలుని, కొంతదవ్వు = కొంతదూరము, అనిపి = పంపి, ఆమంత్రితున్ = వీడ్కొనఁబడినవానిఁగా, చేయన్ = పోయిరమ్మని చెప్పఁగా, నందనందన సందర్శన ఆనందలోలఆత్ముండు = కృష్ణునిచూచుటచేఁ గలిగినసంతోషముచేఁ బరవశమైన మనస్సుగలవాఁడు, తనమనంబునన్ = తనమనస్సునందు.

క. నాపుణ్య మరయ నెట్టిదో
యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తముని బరుం గనుఁగొంటిన్. 57

టీ. అరయన్ = ఆలోచింపఁగా, ఆపుణ్యనిధిన్ = ఆపుణ్యములకు గనియైనవానిని, ప్రశాంతున్ = మిక్కిలియోర్పుకలవానిని, అచ్యుతున్ = నాశములేనివానిని, అఖిలవ్యాపకున్ = ఎల్లయెడలవ్యాపించినవానిని, బ్రహ్మణ్యున్ = బ్రాహ్మణులకు హితుఁడయినవానిని, చిత్‌రూపకున్ = జ్ఞానరూపము గలవానిని, పురుషఉత్తమునిన్ = ఉత్తముఁడయినపురుషుని, పరున్ = శ్రేష్ఠుని, కనుఁగొంటిన్ = చూచితిని.

తా. నేనెంతపుణ్యముచేసితినోగాని యాపుణ్యాత్ముఁ డగు కృష్ణునిం జూచితిని.

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి
నేనేడ నిఖిలావనీశుఁ డైన
యిందిరాదేవికి నెనయంగ నిత్యని
వాసుఁడై యొప్పునవ్వాసుదేవుఁ
డేడ నన్నర్థిమైఁ దోడఁబుట్టినవాని
కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్ప
మున నుంచి సత్క్రియ లూని నడిపి
తే. చారునిజవధూకరసరోజాతకలిత
చామరానిలవిగతవిశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ
తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి. ౬౮

టీ. పరికింపన్=ఆలోచింపఁగా, కృపణస్వభావుండును = నీచమైన స్వభావము గలవాఁడును, ఐనట్టియేను=అయినట్టికుచేలుఁడు, ఏడ=ఎక్కడ, నిఖిలఅవనిఈశుఁడు = ఎల్లభూమికిఁ బ్రభువు, అగుచున్, ఇందిరాదేవికిన్=లక్ష్మీదేవికి, ఎనయంగన్ = పొందునట్లు, నిత్యనివాసుఁడు = ఎడతెగని యునికిపట్టు, ఐఒప్పుఅవ్వాసుదేవుఁడు=అయిప్రకాశించునట్టియాకృష్ణుఁడు, ఏడన్, నన్నున్=కుచేలుని, అర్థిమైన్ = పూనికచేత, తోడఁబుట్టినవాని, కైవడిన్=వలె, కౌఁగిటన్, కదియన్ = కూడునట్లు, చేర్చి, నన్నున్=కుచేలుని, దైవంబుగాన్ = దేవతగా, భావించి = తలఁచి, నిజతల్పమునన్ = తనపాన్పునందు, ఉనిచి, సత్క్రియలు = సత్కారములను, పూని=ప్రయత్నము, నడిపి=చేసి, చారు=అందములైన, నిజవధూ = తనభార్యయొక్క, కరసరోజాత = కమలములవంటి చేతులచేత, కలిత = పట్టఁబడిన, చామర=వింజామరలయొక్క, అనిల=గాలిచేత, విగత=పోయిన, విశ్రమునిన్=బడలిక

గలవానిని, చేసి, శ్రీ = లక్ష్మీదేవియొక్క, కుచ= స్తనములయందు, ఆలిప్త= పూయఁబడిన, చందన = గంధముచేత, అంచిత = ఒప్పుచున్న, కర అబ్జ= కమలమువంటి చేతులయొక్క, తలములన్ = ప్రదేశములచేత,వత్సలత=ప్రేమ, మెఱసి=ప్రకాశించి, అడుగులు=పాదములను, ఒత్తెన్ =పిసికెను.

తా. పేదవాఁడ నగునన్నాకృష్ణుఁడు తనతోఁబుట్టువువలె నాదరించి నన్ను దేవునివలె భావించి సత్కారములుచేసి తనభార్యచేతియందలి విసన కఱ్ఱచే బడలికను బోఁగొట్టి తనచేతులచే నాకు గంధముపూసి పాదము లొత్తెను.

వ. కావున. 59

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియు
న్నీనితెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడనికాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే. 60

టీ. శ్రీనిధి=సంపదకుగని, కృష్ణుఁడు, నన్నున్ -కుచేలుని, ఘనంబు గన్ =గొప్పగా, పచరించి=చేసి, విత్తము = ధనమును, ఏమియున్ =కొంచె మైనను, ఈనితెఱంగు = ఇయ్యనివిధము, ఎన్నన్ = ఆలోచింపఁగా, కానఁ బడెన్ = తెలిసెను. దరిద్రుఁడు, సంపత్ అంధుఁడు ఏ=సంపదచే గ్రుడ్డి వాఁడై, కానక=తెలియక, తన్నున్ = కృష్ణుని, చేరఁడు = పొందఁడు, అని=అనియేకాని, కాక, శ్రితఆర్తిహరుఁడు = ఆశ్రయించినవానిబాధ లను పోఁగొట్టువాఁడు, సత్ కృప అంభోనిధి=మేలిదయకు సముద్రుఁడైన కృష్ణుఁడు, నను=కుచేలుని, సర్వవస్తుపరిపూర్ణునిఁగాన్ = ఎల్లవస్తువులచే నిండినవానినిఁగా, చేయకుండునే.

తా. కృష్ణుఁడు నా కట్లు మర్యాదలుచేసి ధనమియ్యకపోవుటకుఁ గారణము నాకుఁ దెలిసెను. పేదవానికి భాగ్యము కలిగినయెడల తన్నువఁ ఱచుననియేకాని లేనియెడలఁ గృష్ణుఁడు నాకు నెల్లవస్తువుల నిచ్చును.

వ. అని తనమనంబున వితర్కించుచు నిజపురంబునకుం జనిచని ముందట. 61

టీ. వితర్కించుచున్ = ఊహించుచు, నిజపురంబునకున్ = తనపట్టణమునకు.

సీ. భానుచంద్రప్రభాభాసమానస్వర్ణ
చంద్రకాంతోపలసౌధములును
గలకంఠశుకనీలకంఠసముత్కంఠ
మానితకూజితోద్యానములును
ఫుల్లసితాంభోజహల్లకకహ్లార
కైరవోల్లసితకాసారములును
మణిమయకనకకంకణముఖాభరణవి
భ్రాజితదాసదాసీజనములు

తే. గలిగి చెలువొందుసదనంబు గాంచి విస్మ
యమును బొందుచు నెట్టిపుణ్యాత్ముఁ డుండు
నిలయ మొకొ యపూర్వమై నెగడె మహిత
వైభవోన్నతలక్ష్మీనివాస మగుచు. 62

టీ. భాను = సూర్యునియొక్కయు, చంద్ర=చంద్రునియొక్కయు, ప్రభా=కాంతివంటికాంతిచేత, భాసమాన = ప్రకాశించుచున్న, స్వర్ణ=బంగారుయొక్కయు, చంద్రకాంతఉపలత్=చంద్రకాంతమణులయొక్కయు, సౌధములును=మేడలును, కలకంఠ = కోయిలలయొక్కయు, శుక = చిలుకలయొక్కయు, నీలకంఠ=నెమిళ్లయొక్కయు, సముత్కంఠ = మిక్కిలిధ్వనిగల, మానిత=గౌరవింపఁబడిన, కూజిత=పలుకులుగల, ఉద్యానములును = పూఁదోఁటలును, ఫుల్ల = వికసించిన, సితఅంభోజ = తెల్లతామరలచేతను, హల్లక=ఎఱ్ఱకలువలచేతను, కహ్లార = వాసనగలకలువలచేతను, కైరవ = తెల్లకలువలచేతను, ఉల్లసిత=మిక్కిలిప్రకాశించుచున్న, కాసారములును=కొలఁకులును, మణిమయ = రత్నాలు అధికముగాఁగల, కనక=బంగారుయొక్క,

కంకణ=కడియములు, ముఖ=మొదలుగా, ఆభరణ=సొమ్ములచేత, విభ్రాజిత =మిక్కిలిప్రకాశించుచున్న, దాసదాసీజనంబు = పరిచారకులును పరిచారిక లును, గలిగి, చెలువొందుసదనంబు = ప్రకాశించునట్టియింటిని, కాంచి = చూచి, విస్మయమును = ఆశ్చర్యమును, పొందుచున్, ఎట్టిపుణ్యాత్ముఁడు= ఎట్టిపుణ్యమనస్సు కలవాఁడు, ఉండునిలయముఁబొక్కో = ఉండుగృహమో, అపూర్వమై=క్రొత్తదై, సుహితవైభవ ఉన్నతలక్ష్మీనివాసము = మిక్కిలిగొప్ప దైనసంపదచే సున్నతమగులక్ష్మి కునికిపట్టు, అగుచున్, నెగడెన్ = ప్రసిద్ధి కెక్కెను.

తా. అచ్చటి బంగారుమేడలును చంద్రకాంతమణుల మేడలును వరు సగా సూర్యచంద్రకాంతులవలెనున్నవి. అచ్చటియుద్యానములందుఁ గోయి లలు చిలుకలు నెమిళ్లు మొదలగుపక్షులు కూయుచుండును. అచ్చటికొలఁకుల యందుఁ దెల్లతామరలు మొదలగుపూవు లున్నవి. అచ్చటి పరిచారకులును పరి చారికలును రత్నాలుగల బంగారుసొమ్ములను ధరించియున్నారు. ఇట్టివాని పొందియుండునింటినిఁ గాంచి ఆశ్చర్యమునొందుచు నీగృహము ఎట్టిపుణ్యా త్మునిగృహమో ఈభూమియం దపూర్వమై నెగడియున్నది. అలంకారము యథాసంఖ్యము.

వ. అని తలపోయుచున్న యవసరంబున. 63

టీ. తలపోయుచున్న అవసరంబునన్=తలంచుచున్నసమయమునందు.

తే. దివిజవనితలఁ బోలెడు తెఱవ లపుడు
డాయ నేతెంచి యిందు విచ్చేయుఁ డనుచు
విమలసంగీతనృత్తవాద్యములు చెలఁగ
గరిమఁ దోడ్కొని చని రంతిపురమునకును. 64

టీ. దివిజవనితలన్ = దేవతాస్త్రీలను, పోలెడుతెఱవలు = పోలునట్టి స్త్రీలు, అపుడు, డాయన్ = సమీపించునట్లు, ఏతెంచి=వచ్చి, ఇందున్= ఇచ్చటికి, విచ్చేయుఁడు=రండు, అనుచున్=అనిచెప్పుచు, విమల=దోషము లేని, సంగీత=పాటలును, నృత్త=ఆటలును, చెలఁగన్=ఒప్పునట్లు, గరిమన్=

గొప్పతనముచేత, అంతిపురమునకును = అంతఃపురమునకు, తోడ్కొని = పిలుచుకొని, చనిరి=పోయిరి.

తా. మిక్కిలి చక్కఁదనము గలస్త్రీలు వచ్చి సంగీతములు మొదలగునవి చేయుచుఁ గుచేలుని నంతఃపురమునకుఁ దీసికొనిపోయిరి.

వ. ఇట్లు చనుదేర నతనిభార్య యైనసతీలలామంబు దనమనంబున నానందరసమగ్న యగుచు నప్పుడు. 65

టీ. చనుదేరన్=రాఁగా, ఆతనిభార్య = ఆకుచేలునిభార్య, సతీలలామంబు = పతివ్రతలయం దుత్తమురాలు, ఆనందరసమగ్న = సంతోషమను నీటియందు మునిఁగినది.

సీ. తనవిభురాక ముందటఁ గని మనమున
హర్షించి వైభవం బలర మనుజ
కామినీరూపంబు గైకొన్న యిందిరా
వనితచందంబునఁ దనరుచున్న
కలకంఠి తనవాలుకన్నులక్రేవల
నానందబాష్పంబు లంకురింప
నతనిపాదంబుల కాత్మలో మ్రొక్కి భా
వంబున నాలింగనంబు చేసె

తే. నాథ రా దేవుఁ డతులదివ్యాంబరాభ
రణవిభూషితయై రతిరాజుసాయ
కములగతి నొప్పుపరిచారికలు భజింప
లలితసౌభాగ్య యగునిజలలనఁ జూచి. 66

టీ. ముందటన్=ఎదుట,తనవిభురాకన్=తనపెనిమిటియొక్కవచ్చుటను, కని=చూచి, మనమునన్=మనస్సునందు, హర్షించి=సంతోషమునొంది, వైభవంబు=సంపద, అమరన్=ఒప్పునట్టు, మనుజకామినీరూపంబు=మనుష్యస్త్రీయొక్కరూపును, కైకొన్నఇందిరారమణిచందంబునన్ = పొందిన లక్ష్మియనుస్త్రీవలె, తనరుచున్నకలకంఠి=ప్రకాశించుచున్నస్త్రీ, కుచేలునిభార్యయనుట,

తనవ్రాలుకన్నులక్రేవలన్ = తనయొక్క నిడుపులైన కన్నులయొక్క కొనల నుండి, ఆనందబాష్పములు = సంతోషముచేఁ గలుగుకన్నీళ్లు, అంకురింపన్ = పొడమఁగా, అతనిపాదంబులకున్ = ఆకుచేలుని అడుగులకు, ఆత్మలోన్ = మనస్సునందు, మ్రొక్కి = నమస్కరించి, భావంబునన్ = మనస్సునందు, ఆలింగనంబునన్ = కౌఁగలింతను, చేసెన్, అధరాదేవుఁడు=అపుడమివేల్పు, ఆకుచేలుఁడు, అతులదివ్య అంబరఆభరణవిభూషితయై=సాటిలేనిశ్రేష్ఠములైన వస్త్రములచేతను సొమ్ములచేతను అలంకరింపఁబడినదై, రతిరాజుసాయకము లగలెన్=మన్మథునిబాణమువలె, ఒప్పుపరిచారికలు = ప్రకాశించునట్టిపనికత్తెలు, భజియింపన్=సేవింపఁగా,లలితసౌభాగ్య=చక్కని మంచిభాగ్యముకలది, అగునిజలలనన్ = అయినతనభార్యను, చూచి.

తా. కుచేలునిభార్య అట్లుతనయెదుటికివచ్చిన పెనిమిటిని జూచి మనుష్యస్త్రీరూపమును బొందినలక్ష్మియో యన్నట్లు ప్రకాశించుచు సంతోషంబున విశాలంబులగు కన్నులనుండి కన్నీళ్లు గాఱఁగా మనస్సున పెనిమిటి పాదములకు నమస్కరించి కౌఁగలించుకొనెను. కుచేలుఁడు మంచివస్త్రములు సొమ్ములు ధరించి మిక్కిలి చక్కఁదనముగల పనికత్తెలచే సేవింపఁబడుచు వైభవము గలిగియున్నతనభార్యను జూచి.

క. ఆనారీరత్నంబును
దానును ననురాగరసము దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం
పూనినహరిలబ్ధవైభవోన్నతి మెఱయన్. 67

టీ. ఆనారీరత్నంబును = ఆస్త్రీలయందు ఉత్తమురాలును, తానున్ = కుచేలుఁడును, అనురాగరసము = వలపుయొక్క అతిశయము, తళుకొత్తఁగాన్=ప్రకాశింపఁగా, నిత్యఆనందమున్ =ఎడతెగని సంతోషమును, ఒందుచున్ = పొందుచు, పెంపు = అతిశయమును, ఊనినహరిలబ్ధవైభవఉన్నతి = పొందినకృష్ణునివలనఁ బొందఁబడినయైశ్వర్యముయొక్క అతిశయము, మెఱయన్ = ప్రకాశింపఁగా.

తా. ఆకుచేలుఁడును అతనిభార్యయును ఒండొరులమీఁద మిక్కిలి ప్రేమము నెల్లప్పుడును సంతోషమును గలిగి, కృష్ణునివలనఁ బొందినయైశ్వర్యముతో నొప్పుచు.

సీ. కమనీయపద్మరాగస్తంభకంబులుఁ
  గోమరారుపటికంపుఁగుడ్యములును
మరకతనవరత్నమయకవాటంబులుఁ
  గీలితహారినీలజాలకములు
దీపితచంద్రకాంతోపలవేదులు
  నంచితవివిధపదార్థములును
దతహంసతూలికాతల్పంబులును హేమ
  లాలితశయనస్థలములు దనరు
తే. సమధికోత్తుంగభద్రపీఠముల సిరులు
మానితోన్నతచతురంతయానములును
వలయుసద్వస్తుపరిపూర్ణవాటికలును
గలిగి చెలువొందుమందిరం బెలమిఁ జొచ్చి. 68

టీ. కమనీయపద్మరాగస్తంభకంబులున్ = చక్కని కెంపుల కంబములును, కోమరారుపటికంపుఁగుడ్యములును = ఒప్పుచున్న స్ఫటికమణులగోడలును, మరకతనవరత్నమయకవాటంబులున్ = పచ్చలనెడు శ్రేష్ఠములయినమణులతోఁ జేయఁబడిన తలుపులును, కీలితహారినీలజాలకములున్ = కూర్పఁబడిన యింద్రనీలమణుల కిటికీలును, దీపిత చంద్రకాంత ఉపలవేదులున్ = ప్రకాశముగల చలువఱాతి తిన్నెలును, అంచిత వివిధపదార్థములును = ఒప్పుచున్న పలువిధములయిన వస్తువులును, తతహంసతూలికాతల్పంబులును = గొప్పవైన హంసలయీఁకలచేఁ జేయఁబడిన పాన్పులును, హేమలాలితశయనస్థలములున్ = బంగారముచే నలంకరింపఁబడిన పరుండుచోటులును, తనరు సమధిక ఉత్తుంగభద్రపీఠముల సిరులున్ = ప్రకాశించునట్టి మిక్కిలి పొడువైన సింహాసనములకాంతులును, మానిత ఉన్నతచతురంతయానములును =

పూజింపఁబడిన గొప్పవైనపల్లకీలును, వలయు సత్ వస్తుపరిపూర్ణవాటికలును = కావలసిన మంచిపదార్థములచేత నిండినవాడలును, గలిగి, చెలువొందుమందిరంబు=చక్కనిగృహమును, ఎలమిన్=సంతోషములో, చొచ్చి.

తా. సకలసంపదలచేత నొప్పారుచున్న యాగృహమును కుచేలుఁడు ప్రవేశించి.

వ. సుఖంబున నుండునట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు నిర్మలం బగుతనమనంబున నిట్లను. ఇంతకాలం బత్యంతదురంతంబగుదారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి యున్ననాకుం గడపట గలిగినవిధంబున నిప్పుడు.

టీ. తనకు = కుచేలునకును, మనోవికారంబులు = మనస్సునకుదోషములు, పొడమకుండన్ = పుట్టకుండునట్లు, వర్తించుచు=ఉండుచు, నిర్మలంబు=పాపములేనిది, అత్యంతదురంతంబు = మిక్కిలిదాఁటరానిది, అగుదారిద్ర్యదుఃఖఅర్ణవంబునన్=అయినబీదఱికముచేతఁ గలిగినదుఃఖము అనుసముద్రమునందు, కడపటన్=తుదియందు.

ఆ. ఎన్నఁ గ్రొత్తలైనయిట్టిసంపదలు నా
కబ్బు టెల్ల హరిదయావలోక
నమునఁ జేసి కాదె నలినాక్షుసన్నిధి
కర్థి నగుచు నల్ల నరుగుటయును. 70

టీ. ఎన్నన్=ఆలోచింపఁగా, క్రొత్తలు=నూతనములు, అయిన ఇట్టిసంపదలు, నాకన్=కుచేలునకు, అబ్బుట=లభించుట, ఎల్లన్, హరిదయాఅవలోకనమునన్ కాదె=కృష్ణునియొక్కదయతోడి చూపుచేతఁగదా, నేను=కుచేలుఁడు, నళినాక్షుసన్నిధికిన్ = కృష్ణునియొద్దకు, అర్థిన్=యాచకుఁడను, అగుచున్, అరుగుటయును=పోఁగా.

తా. ఆలోచింపఁగా, ఈసంపదలన్నియు నాకుఁ గృష్ణుని కటాక్షముచేతనే కలిగినవి, నేను గృష్ణునియొద్దకుఁ బోఁగానే.

క. నను నావృత్తాంతంబును
దనమనమునఁ గనియు నేమి దడవక నను బో
మ్మని యీసంపద లెల్లను
నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్. 71

టీ. నన్నున్=కుచేలుని, నావృత్తాంతంబును=నాయొక్క సమాచారమును, తనమనమునన్=తన(కృష్ణుని) మనస్సునందు, కనియున్=తెలిసియును, ఏమిఁదడవక = ప్రస్తావింపక, ననున్=కుచేలుని, పొమ్ము, అని, ఈసంపదలు, ఎల్లనున్=అంతయును, ఒనరఁగన్ = ఒప్పునట్లు, ఒడఁగూర్చి = కలిగించి, నన్నున్=కుచేలుని, ఒడయనిన్=రాజును, చేసెన్.

తా. నాసమాచారముఁ దెలిసియుఁ గృష్ణుఁడు నాతో నేమియుఁ బ్రస్తావింపక, నన్నుఁబంపి, నాకీసంపదలిచ్చి, నన్నొకదొడ్డ గృహస్థునిఁ గావించెను.

వ. అట్టిపురుషోత్తముండు భక్తినిష్ఠులైనసజ్జనులు లేశమాత్రం బగుపదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిది దృష్టాంతంబుగాదె, మలినదేహుండును జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నాచే నున్నయడుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట తన నిర్హేతుకదయం గాదె, అట్టికారుణ్యసాగరుం డైనగోవిందు నిచరణారవిందంబులయందులభక్తి ప్రతిభవంబుఁ గలుగుం గాక. అని యప్పుండరీకాక్షునియందు లభక్తితాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక రాగాదివిరహితుండును నిర్వికారుండునునై యఖిలక్రియలందు ననంతునియనంతధ్యానసుధారసంబునం జొక్కుచువిగతబంధనుండై యపవర్గప్రాప్తినొందెమఱియును.

టీ. పురుషఉత్తముండు = ఉత్తముఁడయిన పురుషుఁడు=కృష్ణుఁడు, భక్తినిష్ఠులు = భక్తియందునిష్ఠగలవారు, ఐనసత్ జనులు = అయినట్టి సత్పురుషులు, లేశమాత్రంబు = కొంచెము, అగుపదార్థంబు = అయినవస్తువును, భక్తిపూర్వకంబుగాన్ = భక్తిముందుగలుగునట్లుగా, సమర్పించినన్ = ఇచ్చినయెడ, అది = ఆవస్తువును, కోటిగుణితంబుగాన్ = కోటిమడుంగులుగా, కైకొని = తీసికొని, మన్నించుటకున్ = కాపాడుటకు, ఇది=నాసమాచారము. దృష్టాంతంబుగాదె = నిదర్శనముగదా, మలినదేహుండును = మురికిదేహముగల వాఁడును, జీర్ణఅంబరుండును=చినిఁగినగుడ్డలుగలవాఁడును, అని, చిత్తంబునన్ =మనస్సునందు, హేయంబుగాన్ = నీచముగా, పాటింపక = తలఁపక, ఆదరంబునన్=ప్రీతితో, ఆరగించి=తిని, కృతార్థునిన్ = చేయఁబడిన పుణ్యము గలవానిని, తన = ఆకృష్ణునియొక్క, నిర్హేతుకదయన్ కాదె=కారణములేని దయచేతనే కదా! కారుణ్యసాగరుండు=దయకుసముద్రుఁడు, అయిన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తి = అయినట్టి కృష్ణునికమలముల వంటి పాదములయందలి భక్తి, ప్రతిభవంబున్=ప్రతిజన్మమునను, అప్పుండరీకాక్షునియందున్ = ఆకృష్ణునియందు, భక్తితాత్పర్యంబునన్=భక్తితోడియభిప్రాయమునందు, తగిలి = ఆసక్తుఁడై, పత్నీసమేతుండై=భార్యతోఁగూడినవాఁడై, నిఖిలభోగంబులయందున్ = ఎల్లసౌఖ్యములయందును, ఆసక్తి=తగులమును, పొరయక=పొందక, రాగఆదివిరహితుండును = రాగముమొదలగువానిచే విడువఁబడినవాఁడును, నిర్వికారుండునున్ ఐ=చాపల్యములేనివాఁడునై, అఖిలక్రియలందున్ = ఎల్లపనులయందు, అనంతునిఅనంతధ్యానసుధారసంబున్ = కృష్ణునియొక్క కడలేని ధ్యానమనెడు అమృతముయొక్క రుచిచేత, చొక్కుచున్ = పరవశుఁడగుచు, విగతబంధనుండుఐ=పోయినసంసారబంధముగలవాఁడై, అపవర్గప్రాప్తిన్ = మోక్షముయొక్కలాభమును, పొందెన్ = పొందెను.

ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డైనహరికి ధరణిసురులు

దైవతములు గాన ధారణీదివిజుల
కంటె దైవ మొకఁడు గలఁడె భువిని. 73

టీ. దేవదేవుఁడు = దేవతలకెల్లను దేవుఁడును, అఖిలభావజ్ఞుఁడు=ఎల్ల భావముల నెఱిఁగినవాఁడును, ఆశ్రిత=ఆశ్రయించినవారికి, వరదుఁడు=కోరిన వరములనిచ్చువాఁడును, అయినహరి = అయినట్టికృష్ణునకు, ధరణీసురులు = బ్రాహ్మణులు, దైవతములు=పూజింపఁదగినవారు, కాన, భువి = భూమిమీఁద, ధారణీదివిజులకంటెన్ = బ్రాహ్మణులకంటె, దైవము = దేవుఁడు, ఒకఁడు = ఇతరుఁడు, కలఁడే=కలఁడా? (లేఁడని భావము.)

తా. సర్వమును దెలిసిన కృష్ణునకు బ్రాహ్మణులు దేవునితో సమానులు గనుంగ బ్రాహ్మణులకంటె వేఱెదైవములేదు.

క. మురహరుఁ డిట్లు కుచేలునిఁ
జరితార్థునిఁ జేసినట్టిచరితము వినుస
త్పురుషుల కిహపరసుఖములు
హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా. 74

టీ. అవనీనాథా! (పరీక్షిత్తునిసంబోధనము) మురహరుఁడు = కృష్ణుఁడు, ఇట్లు=ఈప్రకారము, కుచేలునిన్, చరితార్థునిన్ = చేయఁబడినయుత్తమకార్యముగలవానిని మహైశ్వర్యవంతునిఁగ, చేసినట్టి చరితమున్, విను సత్పురుషులకు = వినునట్టి పురుషశ్రేష్ఠులకు, ఇహపరసుఖములు = ఈలోకమునందును పరలోకమునందును సౌఖ్యములును, హరిభక్తియుఁ=విష్ణువునందలి భక్తియును, యశము=కీర్తియును, కలుగున్=కలుగును.

తా. ఈకుచేలోపాఖ్యానమును వినునట్టిమహాత్ములకు నిహపరసౌఖ్యములు హరిభక్తియును గీర్తియుఁ గలుగును.

శ్రీః శ్రీః శ్రీః.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రంగేశశతకము, ము. వేంకటరామ నృసింహాచార్యస్వామి | 0 | 4 |
| రమణీమనోహరశతకము | 0 | 4 |
| రమాధీశ్వరశతకము | 0 | 2 |
| రాజగోపాలశతకము | 0 | 4 |
| రాజశేఖరశతకము | 0 | 2 |
| రామలింగేశశతకం, అ. సూరకవి | 0 | 3 |
| రామతారకశతకము | 0 | 4 |
| రుక్మిణీపతిశతకము | 0 | 2 |
| రేఫాలరాజలింగశతకము | 0 | 4 |
| లక్ష్మీశతకము | 0 | 2 |
| లావణ్యాశతకము | 0 | 4 |
| వసుదేవనందనశతకము | 0 | 2 |
| విశ్వనాథశతకము | 0 | 4 |
| వీరనారాయణశతకము | 0 | 4 |
| వృషాధిపశతకము సోమనాథకవి | 0 | 2 |
| శివముకుందశతకము | 0 | 2 |
| శివశతకము | 0 | 2 |
| శ్రీకృష్ణశతకము | 0 | 2 |
| శ్రీశైలమల్లేశ్వరశతకము | 0 | 2 |
| శిఖినరసింహాశతకము (శకునశాస్త్రము) | 0 | 4 |
| శ్రీనివాసశతకము | 0 | 2 |
| సదానందయోగిశతకము | 0 | 2 |
| సర్వలోకేశ్వరశతకము | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| సర్వేశ్వరశతకము | 0 | 2 |
| సంపగిమన్నశతకము | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | 0 | 3 |
| సీతాపతిశతకము | 0 | 2 |
| సుమతిశతకము, సటీక | 0 | 2 |
| సూర్యనారాయణశతకము | 0 | 2 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 3 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రి | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | 7 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకుసరియైన తెలుఁగువచనము | 3 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| దశావతారములు | 1 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | 0 | 2 |
| రేచుక్కపగటిచుక్క కథలు | 0 | 3 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్ర | 1 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| బేతాళునికథలు | 0 | 8 |

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| ప్రతి 1-కి | రూ. | అ. | ప్రతి 1-కి | రూ. | అ. |
| పరమానందశిష్యులకథ | 0 | 3 | మదనకామరాజుకథలు | 0 | 14 |
| వైద్యులకథలు | 0 | 4 | భోజకాళిదాసకథలు | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 | వక్కానుపూర్వకథలు | 1 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 | దేశింగురాజుకథ, జంగంకథ | 0 | 6 |
| శ్రీవివేకానందవిజయము | 1 | 12 | ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | 0 | 6 |
| భారతరమణీమణులు, ప్రథమభాగం | 0 | 12 | డిటో 2-వ భాగము | 0 | 8 |
| ,, రెండవభాగము | 0 | 8 | అరేబియన్ నైట్సు కథలు | 1 | 4 |
| శ్రీమహాభక్తవిజయము, చిత్రపటములతో | 4 | 0 | షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 | సత్యసేనవిజయము, శ్రీ అనంతాచార్యకృతము | 0 | 4 |
| నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరి | 0 | 6 | తాతాచార్యులకథలు | 0 | 6 |
| పంచతంత్రము, సులభశైలి | 0 | 6 | నలుగురు మంత్రులకథలు | 0 | 4 |
| హితోపదేశము ,, | 0 | 12 | నేరములుచేయు జాతులచరిత్రలు, ప్రతిమలతో | 1 | 0 |
| సంగ్రహరామాయణము శేషాద్రిశర్మగారిది | 0 | 10 | అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | 0 | 12 |
| సంగ్రహభారతము ,, | 1 | 0 | అయిదుగురు దొంగలకథ | 0 | 6 |
| సంగ్రహభాగవతము ,, | 1 | 0 | శ్రీ గైక్వారుగారి, ఉపన్యాసములు | 0 | 2 |
| తెనాలిరామలింగనికథలు | 0 | 4 | సూరతు కాంగ్రెస్సు, ఉపన్యాసములు | 0 | 2 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | 1 | 4 | శశిరేఖాపరిణయము, అప్పప్పకవి | 0 | 12 |
| దశకుమారచరిత్రము, ఎనముచింతల సంజీవరాయశాస్త్రికృతము | 1 | 8 | | | |


వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఏస్ప్లనేడ్, చెన్నపురి.